# అంకితం

నాకు నాలుగేళ్ళ వయసున్నప్పుడు 1959లో కృష్ణాజిల్లా దివిసీమలో బావదేవరపల్లి అనే గ్రామంలో బంధువుల పగటి పూట వివాహానికి కుటుంబం అంతా వెళ్ళాము. ఆ వివాహానికి సంబంధించి ఏదో కారణంగా కలహభోజనం జరుగుతూండగా ఆదమరచి ఓ మూల పడుకొని నిద్రపోతున్న నాకు మెలకువ వచ్చింది. మిట్టమధ్యాహ్నపు వేసవి. ఆకలితో శోష వచ్చింది. ఆకలికి తట్టుకోలేక "బాలానాం రోదనం బలం" అనే సూక్తిని ఆచరిస్తుంటే అప్పుడు తెలిసిన ఆవిడ ఒకరు మా అమ్మను నన్ను ఆ ఊళ్ళోనే ఉన్న ఒకరింటికి తోడ్కొని వెళ్ళింది. రెండు నిట్టాళ్ళ పూరిల్లు. ఆ ఇంటి ఇల్లాలు నా పాలిట డొక్కా సీతమ్మయై అప్పటికప్పుడు కుంపటి మీద ఇంత అన్నం ఉడకేసి వేడివేడి ఆ అన్నంలో నిమ్మ ఊరగాయ పచ్చడిని కమ్మని నేతిని పోసి, ఆ పైన శరచ్చంద్ర చంద్రికా ధవళ మహిష మస్తు దధి తోనూ మస్తుగా తినిపించింది. ఆ వయసులో తినగలిగింది పిడికెడన్నమే కావచ్చు. కాని ఆ రుచిని అనుభవించటానికి 63 ఏళ్ళనుంచీ వెతుక్కుంటూనే ఉన్నాను. ఆవిడ పేరు తెలియదు. మళ్ళీ కలవనూ లేదు. ఆ తరువాత "ఎందరో" ఎన్ని సందర్భాలలోనో ముద్దపెట్టో, దాహం తీర్చో, పానీయాలిచ్చో ఈ దేహానికి త్రాణ కారకులయ్యారు. వారిలో మీరూ ఉండి ఉండవచ్చును.

అందరూ పరబ్రహ్మలే.

ఈ కవితా సంపుటి ఆ "బావదేవరపల్లి అన్నపూర్ణమ్మ" తో పాటు ఆ "పరబ్రహ్మ" లందరికీ కృతజ్ఞతా పూర్వకంగా అంకితం.

కవితా ప్రసాద్

# ప్రవచన కవితా (ఉ) కవితలు

రచన

**కవితా ప్రసాద్**

'శంకరాభరణం' ప్రచురణలు



**శంకరాభరణం**

శరణం పండిత మానసాపహారణం, శశ్వద్యశఃకారణం, సరసానందద వాగ్విలాస చరణం, శబ్దార్థ సంపూరణమ్।
చరదత్యద్భుత సత్కవీశ్వరగణం, సాలంబనం 'శంకరాభరణం', నిత్యమహం స్మరామి విలసద్ వాగ్దివ్యసింహాసనమ్।

**ప్రవచన కవితా (౨) కవితలు**

రచన: కవితా ప్రసాద్



**శంకరాభరణం ప్రచురణలు:** 48

**ప్రథమ ముద్రణ:** జూన్ 2021

**కాపీలు:** 100

**ప్రాప్తిస్థానం:** Kavitha Prasad,
73-18-8/1F, S2 - Sree Nandanam Apt.,
Sree Balaji St., (Near Venkateswara Temple),
A.V. Apparao Road,
Rajamahendravaram-533103 (AP)
✆: 9490168907

**వెల:** అమూల్యము

**డిజైన్ & డి.టి.పి.:** పంతుల విట్టుబాబు, హైదరాబాద్, ✆85550 82034
**ముద్రణ:** ముద్రికా ప్రింటర్స్, విజయవాడ,






**డా.తలారి వాసు**
సహాయాచార్య, తెలుగు విభాగం.
ఆదికవి నన్నయ విశ్వవిద్యాలయం,
రాజమహేంద్రవరం.

# ప్రబోధ కవితా కాంతిపుంజాలు

**క**విత్వం ఈశ్వర దత్తమైన ప్రతిభాశక్తి. భావావేశం రమణీయమైన అక్షరరూపం దాల్చి సహృదయ రసజ్ఞుల్ని ఆహ్లాద పరుస్తుంది. హృద్యమైన కవనదేవి సాన్నిధ్యంలో ప్రకాశిస్తుంది. కవిత్వాన్ని అందంగా, మందాకినీ ప్రవాహంలా నడిపించే కవిశ్రేష్ఠులు శ్రీ కవితా ప్రసాద్ గారు. ఆయన నిత్య కవితా కృషీవలురు. విజ్ఞాన శాస్త్ర పరిశోధకులు. చతురహాస ప్రసంగ కుశలురు. ఎద ఎదలో చైతన్యాన్ని రగిలించి మనిషిని మనీషిగా నిలిపే, మనసున ఆర్ద్రత నింపే కవితారస పానాన్ని పాఠకలోకానికి అందించాలని, కవితాగానం చేయాలనే ఆకాంక్ష కలిగిన సాహితీ వరప్రసాదులు.

అవనిగడ్డ బిడ్డడు. కృష్ణాతరంగ నాదాలు ఆయన కవితాంతరంగాలు. ONGC లో డిప్యూటీ జనరల్ మేనేజర్ గా ఉద్యోగరీత్యా అనేక తీరాలను సందర్శించారు. వారి రాజశేఖర శతకము, వచన కవితలు చదువుతుంటే తెలుగు అధ్యాపకులుగా, విశ్వవిద్యాలయ ఆచార్యునిగా ఉద్యోగం చేశారనిపిస్తుంది. నన్నయ గారి నుండి నేటి వరకు తెలుగు సాహిత్యాన్ని ప్రవృత్తిగా, హాయిగా అధ్యయనం చేశారు. ప్రస్తుతం రాజమహేంద్రి గౌతమీ తీరంలో కవితాంతరంగ తరంగాలను చమత్కార సంస్పర్శతో అందిస్తున్నారు.

'నా కవిత తెలుగు భాషా యోషా దరస్మిత' అని ముందే తెలియజేశారు. ఈ సంకలనంలో కవితలన్నీ ప్రకృష్టమైన వచనాలన్నీ

విశేషమైన భావుకతతో, చమత్కారంతో, సున్నితమైన వ్యంగ్యంతో మనకు దర్శనమిస్తాయి. 60 వరకు కవితలు 40 మినీ కవితలు, నానీలు, హైకూలు...వెరసి శత కవితాసంకలనమిది. ఆద్యంతం "ప్రసాద గుణ" భరితమైనప్పటికీ అక్కడక్కడ మేధకు పనిపెట్టే ప్రయోగాలూ ఉన్నాయి. అసలు కృతికి పెట్టిన పేరే ఒక చమత్కృతి.

భాష, సమాజం, రాజకీయాలు, ఓటు, స్వాతంత్ర్య పరిరక్షణ, భౌతిక మానసిక పర్యావరణం, మనుషుల ప్రవర్తన, చమత్కారం, హాస్యం,వ్యంగ్యం... నవరసాలు ఇందులో ఉన్నాయి. నా మాట ఇక్షు రసం, ఆకాశమంత మనసు... సముద్రమంత గుండె నాసొంతం అని అన్నారు కూడా. హల్లు జీవాత్మ, అచ్చు పరమాత్మ అందుకే అక్షరం అంటే మోక్షం. అక్షరాలు మేధావికాస కాంతి పుంజాలు. అక్షరరాణి కచ్ఛపీపాణికి ఇదే నా సాక్షర నీరాజనమని కైమోడ్పులర్పించారు కవితా ప్రసాద్ గారు. అమ్మవారి అనుగ్రహం నిండుగా ఉన్న కవివతంసులాయన.

పూల నవ్వు... ఎలమావుల కోయిల కూసినట్లు ఉత్ఫుల్ల సరోజ సౌధముల తుమ్మెద రాగం తీసినట్లు ఉందంటారు. అరిస్టాటిల్ 'నిన్ను నీవు తెలుసుకో' సిద్ధాంతాన్ని మనోనేత్రంతో అంతరాత్మ పరిశీలనమే సరైన అవసరమైన దారి... అని ప్రబోధించారు. బ్రౌనుకు తెలుగు పిచ్చి, మనకు ఆంగ్లం పిచ్చి, బ్రౌను ఆంగ్లాన్ని వదిలేయలేదు అని చురక వేశారు. ఎన్ని భాషలు నేర్చుకున్నా మాతృభాషను వదులుకోకూడదని హితవు పలికారు. చెట్టు గురించిన కవితాక్షరాల్లో బోధి వృక్షం మనిషిని బుద్ధుడినే కాదు విశ్వశ్రేయోబద్ధుణ్ణి కూడా చేస్తుందంటారు. డబ్బు కోసం ఆర్తి కన్నా కక్కుర్తి ప్రమాదమని, దేశ ప్రగతికి ఓటుతో క్రాంతి జీవాన్ని ఇవ్వాలని సూచించారు. యాసిడ్ దాడుల గురించి రాస్తూ... ప్రేమ నవనవోన్మేష మమైక్య భావామృతం, ప్రేమను కాదంటే ఉన్మాదులు కావద్దని, ఆమ్లాభిషేకాలు చేయొద్దని బ్రతిమాలారు. సామాజిక అవగాహన, రాజకీయ పరిశీలనతో మానవ స్వభావంలోని చిక్కుముడులను తీక్షణంగా లోతుగా పరిశీలించే తాత్విక లక్షణం ఈ కవితల్లో అడుగడుగునా

కనిపిస్తుంది. సామాజిక న్యాయానికి, భద్రతకు ప్రాతినిధ్యం వహించే ప్రతిపక్షంలో కవితా ప్రసాద్ గారున్నారు.

కవి వాక్కు తిరుగులేనిది. నిరంకుశమైనది. కవి చేతిలో ఏ వస్తువైనా సర్వాంగ సుందరంగా మారుతుంది.అవును..'కవికి భావౌచిత్య భాషా సంపద ఆయుధ' మని అన్నారు. ఆస్తులను కాదు, మనసుల్ని కబ్జా చేయాలంటారు. అందరి గుండెల్లోనూ స్థిరంగా తిష్ఠవేసిన వాడే నిజమైన యశః కాయుడు, నిక్కమైన కీర్తిశేషుడంటారు. ప్రతిభకు పట్టంకట్టాలని ఆకాంక్షించారు. అలాజరగని రోజున ఈ స్వాతంత్ర్యం సామాన్యుడికి మేడిపండేనని బాధ పడ్డారు. శౌర్యాభినందనం కవితలో.. పాకిస్తాన్ నుండి అభినందన్ విడుదల సందర్భంగా "మేము సైని'కులం', మేము రక్ష'కులం', మేము సర్జికల్ స్ట్రై'కులం!', మీ కుల గోడలకు, గోలలకు వ్యతిరే'కులం!!' కులం పిచ్చికి చెంపపెట్టు ఈ కవిత. ఏది ధర్మం? ఏది న్యాయం? అని ప్రశ్నించి ధర్మన్యాయాల పరస్పరాశ్రయమే సమాజ హితమని సిరాతో చికిత్స చేశారు. ఒక సంఘటనను, లేదా మన ముందు జరుగుతున్న ప్రతి విషయాన్ని అందరూ చూస్తారు. ఆ సంఘటనలోని విశేషాల్ని గుర్తించి స్పందించి తాను అనుభవించిన విచిత్రానుభూతిని లోకానికి అందించే శక్తి ఒక ద్రష్ట అయిన కవికి మాత్రమే ఉంటుంది. కవితా ప్రసాద్ గారిలోని ద్రష్ట ప్రతి కవితలోనూ కనపడతారు.

'అమ్మ ప్రేమామృత వాహినికి లేదు ఆనకట్ట', 'రాత్రి నన్ను కమ్ముకునే మైత్రి' , 'శృంగార ప్రబంధ గ్రంథ గంధాలు ఇల్లాలి కల్లోలోల్లోల్లస సల్లాపాలు కూడా మల్లెలు!!', "మనం" అనుకుంటూ మనగలిగితే భువనైక కుటుంబ భావన', 'ప్రతి సమాప్తి కాదు పరిసమాప్తి -- చేసికో ఆనంద పరివ్యాప్తి' వంటి వాక్యాలు, పదబంధాలు కవిత్వ పఠనానందాన్ని కలిగిస్తాయి. 'నేనూ ఎన్నికల్లో 'వేలు' పెట్టాను (ఎలక్ట్రానిక్ ఓటింగ్)', 'నాకలోకంలో ఇప్పుడు ఆవకాయ బద్ధ నాకకుండా అమృతపానం చేస్తే నామర్ద! అమ్మతోడు!!', 'పెళ్లాలు సంసార రామాయణానికి 'మొల్లలు', కల

నిజమైందనుకోవటం కూడా ఒక కలే!!, బ్లాకో బ్లాకేన వైట్... 'చెడ్డీ కనిపెట్టిన వాడికి నోబెల్ ప్రైజు రాలేదెందుకు చెప్మా?' 'సొట్ట బుగ్గంటే కుర్రదానికో అందం! మరి కారుకో?' ఒకప్పుడు తరాల మధ్య జనరేషన్ గ్యాప్ ఇప్పుడు 'మా పెద్దాడికి, చిన్నాడికి జనరేషన్ గ్యాప్' వంటి సరదాలు.. నానీలు హైకూల్లో కోకొల్లలు. "ఆవకాయాప్రమేయం", "మల్లెలూ మీకు జోహార్లు" ప్రత్యేక కవితలు.

ఋషి వంటి విశాల విశ్వదర్శనం, సునిశితమైన మేధాశక్తి, ఆనందామృతాన్ని అందరికీ పంచిపెట్టాలన్న తపనతో, ప్రేమ పూర్వక హృదయంతో కవితాప్రసాద్ గారు ఈ కవితా సంకలనాన్ని లోకానికి అందించారు. అందుకే కవితా ప్రపంచం వేరు. కవి కన్నుతో మనం ఈ లోకాన్ని చూడాలి. కవిత్వం సమాజంలో ఆంతరికంగా ప్రవహించే ఒక జీవశక్తి. ఆ జీవశక్తి సమాజ ప్రగతి కోసం పరితపిస్తుంది. మంచి కోసం ప్రయత్నించి కృతకృత్యమౌతుంది.

ఆ ప్రయత్నంలోనే ఈ కవితా సంకలనం మీ చేతుల్లో ఉంది. కవితాప్రసాద్ గారికి అభివాదాలు!

కవితాభిమానులకు శుభాభినందనలు!!

**- డా.తలారి వాసు**

రాజమహేంద్రవరము
14.05.2021.

# మున్నుడి

పఠితలకు నమస్కారములు. ఉద్యోగ విరమణానంతరం మనిషికి తన అభిరుచి ఉన్న ఆనందం ఇచ్చే విషయాలతో తనను తాను సంధించుకోవటం ఉత్తమ వ్యాపకం. అలాంటి ప్రయత్నమే ఇది. ఇప్పుడు చాలమంది చేస్తున్న పనిని నేను చిన్నప్పుడే చేస్తూండేవాడిని. అదే! ఏదో వ్రాసేసి దానికి కవిత్వం అని పేరు పెట్టేసి దొరికిన వాడికి వినిపించేయటం. ఆ వయసులో దొరికే శ్రోతలెవరుంటారు. తోటి విద్యార్థులే. అలా విన్నవాళ్ళు ఆ అనుభవంతో తర్వాతర్వాత గొప్ప నటులైన వాళ్ళున్నారు.

నేను 8 వ తరగతిలో ఉండగా లాల్ బహదూర్ శాస్త్రి గారు కాలం చేసారని విన్న వెంటనే "పుట్టావు అక్టోబరు 1904 న, గిట్టావు జనవరి 1966 న, ఐనా నీవు పొట్టివి, నువు చాలా గట్టివి, అయ్యావు మట్టివి, ప్రధాని లాల్ బహదూరూ, నీ కిదే జోహారూ.. "అంటూ (భయపడకండి. ఈ సంపుటిలో లేదు) ఏదేదో అసంబద్ధంగా ఓ రెండు పేజీలు రాసేసి ప్రక్కన పెట్టి అవసరార్థం బయటకు వెళ్ళి వచ్చేసరికి ఆ కాగితాలు మా నాన్నగారి చేతిలో రెపరెపలాడుతున్నాయి. ఆ తర్వాత ఆయన దీవెనల గుఱించి చెప్పను గాని 55 ఏళ్ళ తర్వాత కూడా అలాంటి కవిత్వం నా చుట్టూ సజీవమై వినిపిస్తూంటే (ఒట్టు. ఆ నా కవితను నేను వీళ్ళెవరికీ వినిపించలేదు) మా నాయనగారిప్పుడు లేరు గూడా కాబట్టి ధైర్యం వచ్చి, ఇప్పటి వరకూ వ్రాసిన వాటిలోంచి కొన్నింటిని ఇలా సంపుటీకరించి ప్రకటించటానికి సాహసించాను. కొన్ని పత్రికల్లో దూరినవీ ఉన్నాయి. ఆ రోజుల్లో సంపాదకులు తృణమో పణమో దక్షిణ కూడా ఇచ్చా(చ్చేవా)రండోయ్. వారందరికి నమోనమః. ఈ సంపుటి అమూల్యము. ఔను. విగ్రహ వాక్యాన్ని మీరెలా గ్రహించినా ఇబ్బంది లేదు. ఐనా ప్రశంసాభిశంసనలు చేయటానికి పఠితలు సర్వాధికారులే.

అల్ప పరిచయస్థులమైనా అడగంగానే స్పందించి మళ్ళీ మళ్ళీ అడుక్కునే అవసరం కల్పించకుండా ఈ సంపుటిని సమీక్షించి గుట్టను కొండగా చూపటానికి తన వంతు ప్రయత్నం తాను చేసిన సరళ హృదయులు, నన్నయ విశ్వ విద్యాలయ ఆచార్య డా.తలారి వాసు గారికి నా హార్దిక (నిజంగానే) ధన్యవాదములు తెలుపుకొంటున్నాను. మెచ్చితే మీకూను. నచ్చని వారికి కూడా చదివినంతమాత్రానికైనా కృతజ్ఞతలు. కవిత్వం చదవటం వినటం అంటే మాటలా! ఎంత ఓపిక ఎంత ధైర్యం ఉండి ఉండాలి మఱి.

అందంగా DTP మరియు ముఖపత్ర చిత్రణ చేసి యిచ్చిన ప్రముఖ కవి శ్రీ విట్టుబాబు గారికి మనసా కృతజ్ఞతలు.

రాజమహేంద్రవరము **– కవితా ప్రసాద్**

20.05 2021

## కవితా సూచిక

# నా కవిత

స్ట్రెయిట్ గా చెప్తే సూటి సుత్తి కవిత
విరిచి విరిచి చెప్తే వచన కవిత
అరచి అరచి చెప్తే విప్లవ కవిత
అర్థం అయీ కాకుండా చెప్తే అభ్యుదయ కవిత
అర్థ కాకుండానే బావురు మంటే భావకవిత
అనర్థంగా చెప్తే దిగంబర కవిత
సాగదీస్తే గేయ కవిత
బాణీకి వ్రాస్తే సినీ కవిత
కాణీకి చెప్తే భట్రాజు కవిత
తనకు తానే చెప్పుకుంటే ఆత్మాశ్రయ కవిత
ఛందశ్చందన చర్చిత
సంధి సమాస సువర్ణ మేఖలాలంకృత
గీతవృత్త చతుష్పద నృత్త శోభిత
మత్తేభ గమన మాలావృత
విక్రీడిత తరళ కోకిల పద్యకవిత!
మత్కవిత!
తెలుగు భాషాయోషాదరస్మిత!
అన్ని కవితలకు ఆదిమాత!
ఏదైతేనేం కవితా వంటకం !
రుచిగా శుచిగా వండితే కవి పాచకులు
అందుతారుగా రసజ్ఞుల అల్లోనేరేళ్ళు!

***

*("కళాగౌతమి" నవంబర్ 2019, "గ్రేటర్ న్యూస్" 15.11.2019 లో)*

2

# పూ నవ్వు

ఆ నవ్వు
వెన్నెల విరిసినట్లు
మల్లెలు కురిసినట్లు
జాజులు విచ్చినట్లు
చందనం పులిమినట్లు
మకరందం త్రావినట్లు
ఆకాశాన్నందినట్లు
నక్షత్రాల్ తళుకుమన్నట్లు
ఉరమని మేఘం మెరిసినట్లు
మమతల వసంతం చివురించినట్లు
మౌనాన్ని మాటగా మార్చినట్లు
కోయిల నిశ్శబ్దంగా కూసినట్లు
కోవెల దేవత మందహసించినట్లు
అనిర్వచనీయం ఆశ్లేషించినట్లు

ఆ నవ్వు
అమ్మ ఒడిలో నా పసినవ్వు
ఇప్పుడు వెతుక్కుంటూ తిరిగినా ఎంత దవ్వు
కాలం సుడిగాలి ధాటికి
దొరక్కుండా ఎగిరిపోయిన దిరిసెన పువ్వు!

***

*(గ్రేటర్ న్యూస్ 11.09.19)*

3

## నాదేశంలో..

నోట్లు విరజిమ్మినోళ్ళే
సీట్లు గెల్చుకొంటున్నారంటే
నిజాయితీ బ్రతికే ఉందనిపిస్తోంది!

కండలు కరిగించిన కరాల్నే
లాటరీల్లో బ్రాకెట్లలో కాల్చుకుంటుంటే
ఆశాదృక్పథం ఇంకా చావలేదనిపిస్తోంది!

గోడవతలి ఎంగిలాకుల కోసం
కాలే కడుపులు కాట్లాడుకుంటుంటే
చైతన్యం ఇంకా చల్లారలేదనిపిస్తోంది!

ప్రదక్షిణ చేసి పైసా వేయకుండానే
పట్టెడు ప్రసాదం పట్టుకెడుతుంటే
భక్తిశ్రద్ధలు బ్రతికే ఉన్నాయనిపిస్తోంది!

బీరు తాగిన బీటిలు కుర్రడు
తండ్రి తద్దినానికి తానే భోక్తైతే
సంప్రదాయం సాంతం చెడలేదనిపిస్తోంది!

నూటికి పాతిక రూపాయలు పెంచినా
ఫైవ్ పర్సెంటు రిబేటిస్తున్నారని
సామాన్యుడు సంతోషిస్తుంటే
నాదేశంలో
సంతృప్తికి "డిస్కౌంటు" లేదనిపిస్తోంది!

***

*(కృష్ణాపత్రిక 01.10.1984 సంచికలో)*

# అధ్యాస

కళ్ళు మూసుకొన్నా
తటిత్కాంతి కనబడుతుంది!
చెవులు మూసుకొన్నా
ఉరుము వినబడి తీరుతుంది!

ఆత్మజ్యోతిని ఆలోకించాలంటే మాత్రం
మనోనేత్రాన్ని తెరవాల్సిందే!
నాదబ్రహ్మాన్ని ఆకర్ణించాలంటే
గుండెచెవుల్ని నిక్కించాల్సిందే!

శక్రచాప సప్తవర్ణోన్మీలనాలు
అనాయాసావలోకితాలు
అతినీలలోహిత పరారుణవర్ణాలు
అదృశ్యావిష్కృతాలు !

అంతరాళం లోని "కృష్ణ బిలా" ల్లాగా
అస్తిత్వమున్న అగోచారాలెన్నో!

ఆత్మ సాక్షాత్కారానికైనా
పరమాత్మ సాకారానికైనా
అంతర్మథనమే అవశ్యపథం
అనాది అస్తి నాస్తి అధ్యాసకు
అనుభవైకమే జ్ఞానపీఠం!

***

*("కౌముది" వెబ్ మాస పత్రిక మే 2020)*

5

## అమ్మ బాసకు అల్లోనేరేళ్ళు

ఒకప్పుడు తెలుగు అక్కరాలు
పలకమీద తెల్లగా పడుకునేవి!
కాగితాన్ని నల్లగా కౌగిలించుకొనేవి!
ఇప్పుడవన్నీ వివర్ణాలైపోయాయి!
పలకమీద మాడుముఖాలయిపోయినాయి!
కాగితం మీద తెల్లముఖాలేసుకున్నాయి!
అమ్మా! అంటే ఎవర్నో అనుకుంటోంది తల్లి!
నాన్నా! అంటే తన్ను కాదనుకుంటున్నాడు తండ్రి!
పసికూన తొస్సిపల్కు "అత్త" ఎప్పుడు వినపడుతుందా అని
ఎదురు చూపులు ఇప్పుడెవరికీ లేవు!
ఆంటీ అనలేకపోతున్నాడనే ఆందోళనతో
వైద్య వరిష్ఠులకు చూపించే రోజులు వచ్చేసాయి!
అమ్మలు అయ్యలూ అనాథాశ్రమాల పాలు!
అచ్చులూ హల్లులూ నిఘంటువుల పాలు!

తెనాలి రామలింగడు ఇప్పటి నాట్యకత్తె కాలు తొక్కితే
చెంప పగుల్తుంది తప్ప అమ్మా వినిపించదు!
తనుకూడా చెంప తడుముకుంటూ అమ్మా అనకపోవచ్చు!
పుట్టింటి కూతలు అత్తింట్లో చెల్లవన్నట్లు
ఆంధ్ర భాష అమెరికా అంగట్లో చెల్లదని
ప్రీకేజీ లోనే ఆంగ్లం కేరుమంటోంది!
అమ్మ బాస భోరుమంటోంది!

బ్రౌనుకు తెలుగు పిచ్చి!
మనకు ఆంగ్లంపిచ్చి!

బ్రౌను ఆంగ్లాన్ని వదిలేయలేదు
మనం మాత్రం తెలుగును వదిలేసి
ఆచంట మల్లన్నలమయ్యాం!
అన్నం పెట్టే రైతు నోట్లోనూ
అన్నం అడుక్కునే మాధుకరుల నోట్లోనూ
తెలుగింకా వినిపిస్తూ బ్రతికుందనిపిస్తోంది.

అమ్మానాన్నా అని అలవాటుగా కాకున్నా
పొరపాటుగానైనా పిలిపించుకుంటే
ఆ కమ్మదనం రుచి అలవాటు చేసుకుంటే
అమ్మభాషకు పోయిన అసువులు పోసినట్లే!

ప్రతి పట్టా చదువులోనూ చివరి దాకా
తెలుగు పరీక్ష ఒకటి ఉత్తీర్ణులవాలని శాసిస్తే
అమ్మ బాసను అక్కున చేర్చుకున్నట్లే!

"వ్రా"యటం కాకున్నా "రా"యటం వచ్చినా
ఏదో రకంగా మనగడకు ఏడుగడ దొరికినట్లే!
పలుకుల్లో తేనె ఒలక్కపోయినా
శాకరిన్ రాలకుంటే చాలు!
"బెగ్గరంకుల"నే విశాలహృదయాల చిన్ని నాలుకలపై
"గాడంకుల్" బదులు జేజె అని ముద్దుపలుకును
నాజూకుగా నడయాడిస్తే అమ్మ తెలుగు మురిసిపోతుంది!
జననీ జన్మభూషాచ స్వర్గాదపి గరీయసీ!
అమ్మకూ అమ్మబాసకూ అల్లోనేరేళ్ళు!

***

*("కళా గౌతమి" సమావేశం లో చదివినది ఆగస్ట్ 2019)*

6

## అస్మాదృశం

నా మార్గం న్యాయం
నా నడత ధర్మం
నా మనసు నవనీతం
నా మాట ఇక్షురసం
నాకు లేదు ద్వేషం
నాకు రాదు కోపం
నే నాడను అసత్యం
నే చేయను పాపం
భార్యాపిల్లలు నాకు కళ్ళు
తల్లి దండ్రులు దేవుళ్ళు
డ్యూటీలో నాకు లేరు సాటి
మంచితనంలో లేరు నాపాటి
భర్తగా శ్రీరాముణ్ణి
సోదరునిగా లక్ష్మణుణ్ణి
స్నేహితునిగా శ్రీకృష్ణుణ్ణి
దేశానికి ఆదర్శ పౌరుణ్ణి
వ్యక్తిగా నిస్వార్థపరుణ్ణి
నేనెంతో మంచివాణ్ణి
ఆత్మవంచనకు అతీతుణ్ణి
అలా అనుకోకుండా ఉంటే
ఇంత కాలం ఎలా బ్రతికుండేవాణ్ణి!
కలరాముణ్ణి! అఘరాముణ్ణి!
యీసు దేవుణ్ణి! కుశంకరుణ్ణి
అయితే కానీ జీవన్మృతుణ్ణి!
నాలాంటి వాళ్ళనేకమంది
నా తోడుగా బ్రతుకుతున్నారని
రూఢిగా తెలిసిన వాణ్ణి!
స్వయం ప్రేరణ కలవాణ్ణి!
సామాన్య మానవుణ్ణి!

# అహమేవ

ఆకాశం ఏకాకి!
వైశాల్యం లో ఎవరు సాటి దానికి!

సముద్రం ఏకాకి!
లోతులో ఎవరు పోలిక దానికి!

నేనూ ఏకాకిని!
ఐతేనేం!
ఆకాశమంత మనస్సు
సముద్రమంత గుండె
నా సొంతం!

***

*(ఆంధ్ర భూమి వార పత్రిక 21.10.82)*

# ఉగాది పచ్చడి

మనోవ్యధ లోని చేదు
అశ్రుచారికల లోని ఉప్పు
బాధతో కడుపులో సుళ్ళు తిరిగే అమ్లపు పులుపు
నిట్టూర్పు నిరాశల లోని వగరు
అయినా వీడని మమకారపు కారం
ఈ ఉగాదైనా యేదో చేస్తుందేమో నన్న ఆశ తీపి
వెరసి అసమర్థుని జీవయాత్ర కైవడి
వెలసె షడ్రుచుల యీ ఉగాది పచ్చడి!

***

# ఈక్షణం

మిమ్మల్నెక్కడో.. కలిసి...
"క్షమించండి! అవకాశంలేదు!"
అదేం?
"నేను కవిని కాను. అందుకని!"
మిమ్మల్ని కలవటం నిజంగా లాటరీ గెల్చినట్లుంది సర్!
"అయ్యో! ఎంత మాట!"
ఔనండీ. కవి కాని మనిషిని కలవటం అంటే మాటలా!
"అలాగంటారా!!"
కాని ఒకటనిపిస్తోంది సర్!
"ఏమిటి?!"
మీరూ కవేనేమోనని! నిజం చెప్పండి!
'ఎలా?!'
మీరన్న "నేను కవిని కాను" అన్నదే ఓ కవితలా ఉంది!
"!!!!!!'
మీరన్న వాక్యంలో స్వభావోక్త్యలంకారం ఉట్టిపడుతోంది!!
"మీరు సమీక్షకులా!!"
ఎలా గుర్తించారు సర్.
"స్వభావో దురతిక్రమః"
అంటే?
"రవి కాంచనిది కవి కాంచును. కవి కాంచనిది సమీక్షకుడు కాంచును."
ఐతే మీరు నిశ్చయంగా కవే. మిగతా 99 ఎప్పుడు
పూర్తి చేస్తారు సర్!
"మీరు మీరే! పునర్నకలయికోస్తు. శలవ్"

***

# అయుధ పూజ

ఆయుధం అంటే
ఒక అస్త్రం, ఒక శస్త్రం, ఒక గుణం,
ఒక వ్యక్తి, ఒక మంత్రం, ఒక పోచ,
ఓ పువ్వు, ఓ నవ్వు, ఓ మాట, మౌనం
ఓ చూపు, ఓ ఏడుపు, ఎన్నో, ఎన్నెన్నో!
కాదేదీ ఆయుధాని కనర్హం!
ఔనౌను! చేయరాదనర్థం!

త్రిపురాసుర సంహారానికి
అయ్యాడు శ్రీ మహావిష్ణువే శస్త్రం !
కాంతను చీకాకు పెట్టిన కాకిపై
జానకీజాని తృణాయుధమే అణ్వాయుధం!
అహింసా గుణమే గాంధీజీకి ఆయుధం!
ఉగ్రమూకలకు మానవబాంబులే ఆయుధం!
మన్మధునికి సుమబాణమే ఆయుధం!
ప్రేమలో పడేయటానికి శుచిస్మితలకు నవ్వే ఆయుధం!
కర్ణుని జయించటంలో శల్యుని మాటలు ఆయుధం!
అతివలకు కన్నీరే కొండొకచో మెండైన ఆయుధం!
సత్యభామ(ల)కు కోపతాపమే ఆయుధం!
"బాలానాం రోదనం ఆయుధమ్ !”
పాకిస్తానుకు భారత్ పై దుష్ప్రచారమే ఓ ఆయుధం!
మొగుడిపై అలకే ఆలికి అసలు సిసలు బ్రహ్మాస్త్రం!
బాసుల్ని జయించాలంటే "కాకా"యే సమ్మోహనాస్త్రాయుధం!

మహర్షులకు తపస్సే ఆయుధం!
మాష్టార్లకు మాటే ఆయుధం!
కవికి భావౌచిత్యభాషా సంపదే ఆయుధం!
అసమర్థుడికి మౌనమే ఆయుధం!

విజయద"శమీ"" పూజకు నోచుకోని
ఆయుధాలవెన్నో! ఇంకెన్నో!
ఆయుధం ఏదో ఒకటి లేకుంటే
దేశాన్నైనా, దేవుణ్ణైనా, మానవుణ్ణైనా
(ఆఖరికి మొగుణ్ణైనా)
ఎవరు పట్టించుకుంటారు (ట) !!!!

***

11

## ఓటే నీ బాట

ఓటు కాదు గాలివాటపు కాగితపు ముక్క!
అది
రాజ్యాంగ దధీచి వెన్నెముక!
త్రిపురాసుర సంహార వైష్ణవ బాణం!

రాముని చేతిలో గడ్డిపరకే బ్రహ్మాస్త్రం అయింది!
నీ చేతిలోని కాగితపు ముక్కే ఔతుంది
నీ ధృడ సంకల్ప మంత్రంతో
ప్రజాస్వామ్య పరిరక్షణకు "బ్రహ్మోస్" క్షిపణి!

ప్రలోభాలకూ, మత్తుపోతలకూ లొంగకు!
గణతంత్రపు శత్రువులకు బెదరకు!
వేలి చుక్కను "వేల"కు అమ్ముకోకు!
వీరాభినందనునిలా ఆత్మగౌరవాన్ని నిల్పుకో!
దేశప్రగతికి నీ ఓటుతో క్రాంతి జీవాన్నిచ్చుకో!

***

*(సాక్షి 27.03.2019 దినపత్రిక లో ప్రచురితము)*

12

## “కల”గా“పులగం”

కలలు కనటానికి కళ్ళు
చారెడేసుండాలని లేవు రూళ్ళు!
తృణసుమాక్షులకు చిన్న కలలూ
పుండరీకాయతాక్షులకు పెద్దకలలూ
విధాయకమేమీ పెట్టలేదు పితామహుడు!
కమలాక్షుడు యోగనిద్రలో కనే కలలు
ఎంత సైజులో ఉంటాయో
ఆయన గుండె యింటావిడే చెప్పాలి!
కళ్ళున్నవాడికి కళ్ళు మూస్తేనే కలలు!
కబోది కనొచ్చు పగలూ రాత్రీ కలలు!
మనోనేత్రం మానవులందరికీ ఉంది!
కలలు కంటానికి లైసెన్సక్కర్లేదు!
కలల మీద ఆర్థిక మంత్రి జియస్టి వెయ్యలేదు(డు)!
కలలు కన్నందుకు అరెస్టు చేసే చట్టమింకా రాలేదు

ఎందుకంటే!

కలలు కనటాన్ని పట్టేసే సాఫ్ట్ వేర్
సిలికాన్ వేలీలో కాలేదింకా తయార్!
అదీ వేదాల్లో ఉందేమో వెట్టి వే‘దంతు’ లే చెప్పాలి!
కలలు కనమనే కదా కలాం చెప్పాడు!
కానీ సాకారం చేసుకోమని రైడరు పెట్టాడు!

కల నిర్వీర్యమై పోతే చిన్నబుచ్చుకోదా!
ప్రతి సారీ ఖొత్త కల కనాలంటే ఎంత కష్టం!
అందుకే అన్ని రాజకీయ పార్టీలు ఐకమత్యంగా
ప్రజల్ని కలల్ని కనటం మానొద్దంటున్నాయి!
కొత్త కలల్ని కంటూ కష్టపడకుండా
అవే అవే కలల్ని పదే పదే కనమంటున్నాయి!
పగలైతే మరీ మంచిదంటున్నాయి!
కలలన్నీ బ్లాకండ్వైటే కాని రంగుల్లో రావని
సైంటిష్టెవడో కలలు కనీ కనీ కలవర పడ్డాట్ట!
ఇండియా కొచ్చి కల కంటే థీరీ తప్పయిందని
గుండె మీద బాదుకొని మరీ ఏడ్చుకుంటాడు!
మిగతావి ఎక్కడైనా కని పెట్టొచ్చు కానీ
కలల మీద ఇక్కడే పరిశోధించాలని ఒట్టుపెట్టుకుంటాడు!
కల నిజమాయెగా అని గంతులెయ్యకండొహో
అదీ ఒక కలేనని తెలుసుకోండహో!!

***

*(సమాచారం దినపత్రిక లో 15.8.19 ప్రచురితము)*

13

## కవ్వింత

డబ్బులిస్తే చాలు
"తుస్సు" వాగ్దానాలు, "తొస్సి" వచనాలూ
డెబ్బై ఏళ్ళుగా దోకుతున్నదే
మండుటెండలో నైనా మళ్ళీ వింటానికి వెళ్తారా!
నవ సుమమరంద మధురస్వాదు
కవితాగానం విని ఆనందించండంటే
దరిదాపులకైనా రారా?
నేనూ "శ్రోత" కట్నం ఇవ్వాలా!
భోజ భూమిలో, రాయల నేలలో
కవితా శ్రవణం పంచభూతాలకే పరిమితమైందా!
నాకు తీరేదాకా కచ్చి
మీరే ఎదురు చందాలిచ్చి
ఇంక చాలీ "కవితా" పిచ్చి
అంటూ నాకు మోకరిల్ల వచ్చి
చెప్పేదాకా, రాయటం మానసోచ్చి!
రాజకీయనాయకుల సాచ్చి!

***

# నక్షరతీత్యక్షరః

అక్షరాలు
భాషాయోషాంబరంపై అలంకృతనక్షత్రాలు
నింగిపలకపై లిఖిత తారలు
మేధావికాస కాంతిపుంజాలు
అక్షరం అంటే అమృతం
కవితారసపానమో అమృతపానం!
హల్లు జీవాత్మ! అచ్చు పరమాత్మ!
అందుకే అక్షరం అంటే మోక్షం!
అక్షరానికి ఖడ్గం మరో అర్థం
అందుకే కవిత్వం చెప్పటమంటే
ఖడ్గంతో సహవాసం అన్నాడో కవి!
కవి హృదయం ఎందరికయిందో అర్థం?
కృష్ణబిలాలవంటివి కవి హృదయాలు!
ఆకర్షించి దాచుకున్న ఎన్నో భావనిధులు!
అవి బయటకు పెల్లుబికినప్పుడు
అక్షరాల గెలాక్సీలతో కవితా తేజఃపుంజాలు
రసజ్ఞహృదయాకాశాలను
తటిల్లతారశ్మితో ప్రజ్వలింపజేస్తాయి
ఆకాశం కవి భూరాణికి వినిపించే
అజ్ఞానాంధ్య విచ్ఛేదక కవితలే పిడుగులు
మెరుపులే అక్షరాలు ఉరుములే వాక్కులు
అక్షరమే శబ్దబ్రహ్మం
ప్రాజదువుల మనుగడకదే మూలం
అవిద్యా రోగికి అక్షరమే భేషజం!
అక్షరరాణి కచ్ఛపీపాణికి
ఇదే నా సాక్షరనీరాజనం!

***

*("కళా గౌతమి" మాస పత్రిక లో)*

15

# గవేషణ

"అహం బ్రహ్మ" ఐపోవాలని
జ్ఞానాన్వేషిస్తూ పరిభ్రమిస్తున్నా
ఎండలో ..వానలో ..
ఎండకుండా..తడవకుండా
ఎప్పట్నుంచో.. బహుశః
జన్మ జన్మాంతరాలనుంచీ!

ఒడ్డునే కూర్చుని
బొడ్డు క్రిందేముందో తెలియరాని
పానవట్టం లాంటి పొట్టేసుకుని
మెళ్ళో వేళ్ళాడే లింగంతో
నర్మదా సాలమో ? గండకీ బాణమో ?
కల్పపాయి ఒకానొకడు కైవల్యోపాయం చెప్తూ
అప్పణంగా రాల్తున్న తృణాల్లాంటి పణాలను
తీయమని శిష్యులకు విరక్తి సైగిస్తూ
పాప తిమిరాంధకారం రేసుగుర్రంలా పారిపోయి
జ్ఞానదీపమేదో ఒలింపిక్ జ్యోతిలా వెలగాలంటే..
సంసార సాగరంలో తేలాలంటే ..
పుష్కరాల్లో మునిగి తీరాలి"..అనం(టుం)టే
ఫ్రీయే కదాని పుష్కలంగా గోదాట్లో మునకలేసాను !
కట్టుకున్న బట్ట కొట్టుకుపోతే
చెడ్డీ కనిపెట్టినవాడికి నోబెల్ ప్రైజెందుకు రాలేదు చెప్మా !..

అని గుబులడుతూ బ్రతికి చెడ్డీ కట్టి గట్టున పడ్డాను!
గంగను మ్రింగిన జుహ్నుని చెంగట
కకావికలైన దీన భగీరథుళ్ళా!
సామీ ! ఇది యేమీ? ఏదో వస్తుందనుకుంటే ...?
"వైక్లబ్యం ఎందుకు వత్సా!
కైవల్యం కావాలంటే వైకల్యం ఉంచుకోరాదు!
అది నీ వస్త్రం లాంటిది!
ఉంచుకుంటే ఉంటుంది.. పొమ్మంటే పోతుంది!!
అంటుకుని ఉం(డే)దే అది .. "అహం"!
అదీ కొట్టుకుపోతేనే .. "అహం బ్రహ్మాస్మి"
కొట్టినా పోకపోతే .. "అహంభావాస్మి"!!
గురూజీ ! నాకర్థం కానిదేమంటే ..
శిష్యా!
అర్థం ఐతే .. "సర్వం ఖల్విదం బ్రహ్మ"
అంతవరకూ .. "సర్వం కల్పితం బ్రహ్మ"
మరో పుష్కరాల్లో
నీ తృష్ణ తీరొచ్చేమోలే నాయనా!!!
ఓం శాంతి ఓం శాంతి ఓం శాంతి!

***

16

# చల్తీ కా నామ్ కల్తీ

ఎంతో బాగున్నాయనుకుంటున్న జీవితాల్లోకూడా
ఎదలోపల భర్తీ చేయలేని ఏదో వెలితి!
కారణం బ్రతికే విధానమే కల్తీ!
మనసులు కల్తీ, మాటలు కల్తీ,
సంపాదనలు కల్తీ ,సంబంధాలు కల్తీ!
పెదవుల చిరునవ్వులు కల్తీ!
సంతోషాలూ సంతాపాలూ అన్నీ కల్తీ!
ఎన్నికలు కల్తీ, పడే ఓట్లు కల్తీ!
ప్రభుతలు కల్తీ! ప్రజాస్వామ్యం కల్తీ!
కలి పట్టాదారైన యుగంలో ఉండేదే "కలి"తీ!
స్వార్థం ఒకటే లేనిది కల్తీ!
తెలుసు అందరికీ ఎక్కడుందో గల్తీ!
రోగం తెలుసు, మందూ తెలుసు!
ఇవ్వాల్సినవాడు ఇవ్వడు!
పుచ్చుకోవలసిన వాడు పుచ్చుకోడు!
ఏ మహాత్ముడో, దైవతాత్ముడో మళ్ళా పుడ్తే కాని
యీ ప్రపంచకం మనుగడ మారదు!
కానీ కారణ జన్ములు కల్తీ కడుపుల్లో పుడ్తారా!
పుట్టినా మనం వాళ్ళను కల్తీ చేయకుండా ఉంటామా!
మనకు తెలిసిన విద్య అదొక్కటే కదా!

***

# ఛత్రం ధారయామి

ఏ ఎండకాగొడుగన్నారు కానీ
ఏవాన కేగొడుగో చెప్పలేదు!
ఎండా వానా లేకున్నా కొందరు
గొడుగేసుకునే అంగలేస్తారు!
శునకాలకోసమన్నా పనికి వస్తుందని!
గొడుగేసుకెళ్ళి బలిని
అడుక్కు దించేసాడొక నట వటుడు!
గొడుగేసుకుని కాశీకి పోయేవాణ్ణి
సంసారసాగరం అట్టడుక్కు తోసేస్తాడో బామ్మర్ది!
మరంచేత గొడుగు చేతనుంటే జాగ్రత్త!
అభం శుభం తెలీని పిలకాయల చేత
"నభంబు గొడుగై.." అంటూ పాడించి
పప్పూబెల్లాలు పెట్టించి
తాము డబ్బులుచ్చుకుని
పిల్లలకు టోపీ పెట్టేవాళ్ళు పూర్వం అయ్యవార్లు!
అసలీ గొడుగుతో ఓ గొడవుంది!
అది ఇన్సూరెన్సు పాలసీ తీసికోవటం లాంటిది!
వాన రాదులే అని తీసికెళ్ళకుంటే వానొస్తుంది!
వస్తుందేమో అని తీసికెళ్తే రానే రాదు!
దేవుళ్ళకూ గొడుగంటే మహాయిష్టం!
ఎండా వానా రాని చీకటి గుడి గర్భంలో ఉన్నా
ఛత్రం ధారయామి అని ఓ రాజోపచారం కావాలి!

పూర్వం అందరికీ తాటాకు గొడుగులే!
ఓ సారి తడిసిందంటే మళ్ళీ శీతాకాలం దాకా
తడిబట్టతో తిరిగే శ్రోత్రియుళ్ళా అలాగే ఉండేది!
ఎంతగాలేసినా చువ్వల గొడుగుల్లా వెనక్కి ముడుచుకునేవి కావు!
అర్భకుడైతే ఆకాశగమనం సిద్ధించేది కూడా!
విమానం కనిపెట్టటానికి గొడుగే ప్రథమ ప్రేరణం కావచ్చు!
చిన్నప్పుడు గొడుగేసుకుని వానలో నడుస్తుంటే
నా నెత్తిన ఆదిశేషుడి పడగలున్నట్లు
పైన పడే వానచినుకుల టపటపల శబ్దం
చిన్నికృష్ణుడు నాట్యం చేస్తున్నట్లనిపించేది!
గొడుగులా మూల ముడుచుక్కూచోక
చిన్నపిల్లాడిలా వానలో గొడుగేసుకుని తిరగటం ఏమిటీ?
అని ఇంటావిడ అంటున్నా వానొస్తే గొడుగేసుకుని
ఓ మారలా తిరక్కుంటే తోచి ఏడవదు నాకు!
మనస్సెప్పుడూ చిన్న పిల్లాడే!

***

# ఛాయ

నా నీడ!
పాపం! నీడ లేని నా నీడ!
దానికి నేను నాకు అది!
జోడూ ! తోడూ!
వెన్నంటి పుట్టినదాది
నన్నెప్పుడూ విడవనిది!
నాతో పాటే ఎదిగినది!
పిలవకుండానే నాతో వచ్చేది!
ఎగిరితే ఎగిరేది! దుమికితే దూకేది!
క్రింద పడితే తనూ పడేది!
నేను తిన్నా త్రాగినా
తానూ తిన్నట్లు త్రాగినట్లే అనుకునేది!
నాతో ఎంతెంత దూరాలు నడిచిందో!
ఎన్నెన్ని నా స్వగతాలు విందో!

నోరు విప్పకుండానే
నేను నవ్వితే నవ్వింది!
నేను రోదిస్తే ఏడ్చింది!
నేను నీడ చూసుకుని దాన్ని వదిలించుకున్నా
ఎండలోకి రాగానే నా కాళ్ళను పెనవేసుకునేది!
అస్థి మాంసాలు లేకపోయినా
అవ్యాజానుబంధాన్ని చూపేది!

నా అస్తిత్వమే తన ఉనికి అనేది!
ఏదో నాడు మరో లోకంనుంచి పిలుపు వస్తుంది
ఓ నా నీడా! నిన్ను విడిచి ఎలా వెళ్ళేది!
ఆలోకంలో వెలుగైనా చీకటైనా
అన్ని దిక్కులనుంచి సమంగా ఉంటుందట!
మరి నీకు నన్నంటుకునుండే అవకాశమే ఉండదుట!
పోన్లే! దిగులు చెందకు!
నీకు మాటిస్తున్నా!
నీకోసం మళ్ళీ పుడ్తా!
నువ్వూ నాతో పాటే పుడ్డువు కాని!!

***

## 19

# డబ్బు

ధనమూలమిదం జగత్
డబ్బుకు లోకం దాసోహం!
చర్విత చర్వణం!
వింటూనే ఉన్నాం! ఉంటాం!
అర్థమనర్థం భావయ నిత్యం!
ఆది శంకరులన్నారు కాని సత్యం!
ఆయన వారసులు మాత్రం
విత్తభాగ్యులకే పాదుకాపూజలకు
ఇస్తారవకాశం !
డబ్బుక్కూడా వర్ణ భేదాలున్నాయి!
మనుషుల్తో అంటకాగి దానికీ ఆ లక్షణాలొచ్చాయేమో!

ఏడుకొండలమీద ఓ డబ్బు మగడున్నాడు!
ఆయన ఒరిజినల్గా ఇటుకరాయంత ఎత్తుగా ఉండేవాడని
పురాణంలో ఉందని చాగంటో సామవేదమో ప్రవచించారు!
బహుశ నల్లడబ్బు పుచ్చుకుని పుచ్చుకునీ నల్లనయ్య అయ్యుంటాడు!
ఆహారం ఎక్కువైతే అజీర్ణం చేస్తుందేమో కాని
అర్థానికి ఆ ఇబ్బందేమీ ఉన్నట్లు లేదు!
కడుపు నింపు , కప్పు, కట్టుగుడ్డ కోసం
డబ్బు సంపాదనలో లేదు దోషం!
మనవడి కోసం మూటకట్టాలనుకోవటమే వ్యామోహం!

తిరిగిరాని పరహస్తగతాల్లో విత్తం కూడా ఒకటని
పూర్వీకులెప్పుడో అరచి అరచి చెప్పారు! చచ్చారు!
మన బాంకులకు మాత్రం మాలవ్యాలు, మోడీలు
కన్నాలేసి చూపించేవరకూ మోకాల్లోది తల్లోకి రాలేదు!
డబ్బు సంపాదనలో నిద్రాహారాలు మాని బ్రెయిన్ డ్రెయినయి
చివరికి అన్నమే తినలేని అవిటివాడయ్యాడో "ధీరు"డు!
ముళ్ళపూడి చెప్పిన డబ్బు చేయడమంటే ఇదేనేమో!

రాజుల డబ్బు రాళ్ళపాలు, కవులపాలు అన్నారు!
వాళ్ళు లేకపోబట్టే కదా కవిత్వాన్ని కొనేవాళ్ళే లేకపోయి
కవులు కూడా సహకారోద్యమాలు నడుపుకుంటున్నారు!
సన్మానపత్ర కవులు కొంత నయం గానే ఉన్నట్లున్నారు!
ఏమాటకామాటే చెప్పుకోవాలండోయ్!
గల్లీ పత్రికలు పాపం "ఉదారం"గానే అంతో ఇంతో ప్రచురిస్తున్నాయి!

డబ్బు మంచీ చేస్తుందండోయ్ అప్పుడప్పుడూ!
డబ్బుకోసం కాటికాపరైన హరిశ్చంద్రుడికి
డబ్బులు డిమాండ్ చేస్తేనే కదా పెళ్ళాం పిల్లాడని తెలిసింది!
డబ్బు లివ్వక పోయినా మొబైల్ నోట్ బుక్ లో
డబ్బు మీద ఎంతైనా మెండుగా వ్రాసుకొంటూ పోవచ్చు కాని
నా కరకలానికి ఉన్న వేళ్ళ నిబ్బులు
అరిగి చిట్లే అవకాశం దండిగా ఉన్నందున
రెండు మాటలాడి ఉండిపోతాను
డబ్బు కోసం ఉంటే తప్పులేదు ఆర్తి!
కాని వెంట రాని దాని కోసం పడకు కక్కుర్తి!!

***

20

## తథాగతం

అప్పుడు తెలియకున్నా
ఆ తర్వాతెప్పుడో తెలిసింది
పుట్టటమనేది ఒకటుందని!
తెలియనిది..అదే..ఎందుకని?
మరీ తెలియనిది పుట్టినాక ఏమిటని?
పుట్టినందుకు పుట్టపుట్టువలా
సంసారాన్నో..సమాజాన్నో
సంగతించటమో..సంఘటించటమో చెయ్యాలి కదా!

అందరిలాగే పెరిగాను
చదువు...ఉద్యోగం! పెళ్ళాం...పిల్లలు!
ఆకలేస్తే అన్నం తిన్నాను
అరక్కుంటే మందులు తిన్నాను
పురుగులా పుస్తకాల్ని తొలిచాను
పురుషార్థ సాధనకంటూ తీర్థాలు తిరిగాను
పితృపిండాలు పెట్టాను..గుళ్ళనూ దర్శించాను
దేవదూతలనూ పాదస్పర్శించాను..
కొంచెం బిచ్చమూ విదిలించాను
హోమాలతో స్వర్గ "బీమా"నూ చేసాను
శక్తి..భక్తి..రక్తి..ముక్తి
ప్రవచనకర్తల తర్క వక్తృత్వోక్తులూ విన్నాను!
ప్రశ్నకు తుది బదులేదీ? ..తెలియరాలేదు!

వినాదైన్యేన జీవనం అనాయాసేన మరణం...
ఇదేనా!.. ఇంతేనా జీవన పరమార్థం!
ఆలోచనామగ్నుడనై అదాటున క్రింద పడ్డాను
ఆసరా యిచ్చి లేపింది అ ఆలు చదివే పాప
అకల్మషాంతరంగ స్వరూప!
ఎదురుగా కనుపించాయి
ఆకుల్లాగా పక్షులు వాలిన చెట్టుకొమ్మలు
ముసలి భిక్షుకులు ఆనిన మ్రాను మొదలు
కదలని యీ చెట్టు ఎప్పుడు పుట్టిందో!..తెలియదు!
ఎందుకు పుట్టానని పట్టించుకున్నట్లూ లేదు
ఎప్పుడో మోడౌతానేమోననే ఆందోళనా రాదు
నేల నిలబెడుతోంది ఆకాశం ఆశ్వాసిస్తోంది
రశ్మిమంతుడు శక్తినిస్తున్నాడు
వరుణుడు నీళ్ళాడిస్తున్నాడు
గాలి ఊసులాడుతోంది
చివరి(కో)నాడు అగ్ని ఆశ్లేషిస్తుంది

అలా ఒంటిగా మౌనసైనికుడిలా పంచభూతాత్మక ప్రకృతిలో మమైక్యమై
పరార్థజీవనమే పరమార్థ భావమని..జీవ పరమాత్ముడైన ఋషిలా!
పచ్చమొక్కై తిండిపెడ్తోంది..ఎండుగడ్డై పాలనిస్తోంది
జబ్బుకు మందౌతోంది..నారై, దారమై బట్టనిస్తోంది
కలపై ఇంటినిస్తోంది..దూలమై ఇంటిని మోస్తోంది
ద్వారమై కావలి కాస్తోంది..ఆకులతో ఇంటి కప్పునిస్తోంది
ఇంటావిడ పూలకొప్పై అనురాగమిస్తోంది!
వంటచెరకై పంటచెఱకై..పక్వాన్న పరమాన్నాల నిస్తోంది

పాడెయ్యై నిన్ను మోస్తోంది..చితియై సాగనంపుతోంది
కడకు తనకు చితికూడా తానే ఔతోంది
తన నీడలో నిలబడితే పహరా కాస్తోంది
తనమొదట్లో కూలబడితే ఆసరా యిస్తోంది
బోధివృక్షమై నిన్ను బుద్ధుణ్ణి చేస్తోంది
విశ్వశ్రేయోబద్ధుణ్ణి చేస్తోంది!

ఆ..! పుట్టు గిట్టింపుల మధ్య గుట్టు తట్టింది!
చేతనైనట్లు బ్రతకటం కాదు..
చేరి చేయూతనిస్తూ బ్రతకటం అని!

***

("కౌముది" వెబ్ మాస పత్రిక జూలై 2017 లో)

21

## దక్ష(తా)యజ్ఞం

మొండానికి తలనతికించే ప్రక్రియ
విజయవంతమైంది!
డెబ్బైఏళ్ళ నుంచీ వివిధ శస్త్రాస్త్రాలతో
కాని పని ఓ కలం పోటుతో పూర్తైపోయింది!
భారతదేశాన్ని అఖండం చేసి
అఖండలుడయ్యాడు నరేంద్రుడు!
నిలువెత్తు ఉక్కు విగ్రహాన్ని నిల్పటమే కాదు
వల్లభ్ భాయికి వారసత్వాన్ని నిలిపాడు!
స్వాతంత్ర్యేష్టికి అవభృథం పూర్తయింది!
'అమితా'నంద పరిపుష్టమైంది!
కాశ్మీరానికి యీ కుంకుమసుమాలంకరణతో
సువాసినీ పూజ పూర్తయింది!
ఇప్పుడు కాశ్మీరం సవతి ఆడపడుచుకాదు
సొంత ఆడపడుచు!
భారతావని తలమానికానికి యీ పులికడుగుతో
వినూత్న కాంతిపుంజాలు వెలికివస్తాయి
దేశమంతటా జేగీయమానమౌతాయి!

***

# ఆవకాయాప్రమేయం

ఊరగాయల్లో పెద్దే "మేటి" పోటీ
ఏవీ కాలేవు ఆవకాయకు పాటి!
ఏ "కాయా" రాదుగా దానికి "సాటి"!!
"ఊరగాయ" శ్రీ!, "ఊరగాయ" భూ(భీ)షణ!
"ఊరగాయ" విభూ(భీ)షణ! "ఊరగాయ" రత్న!
"తెల్గు" (త)త్వానికి ఆవకాయ ప్రతీక!
"రాష్ట్ర" పచ్చడిగా ప్రకటించాల్సిందే ఇక!
మెడమీద ఉన్నంతకాలం తలకాయ
నోట్లో "ఊరుతూ", ఊరిస్తూనే ఉంటుందావకాయ!
అరణ్యవాసంలో ఆవకాయతోనే
దాశరథులూ, ధర్మజాదులూ మనేరుట!
రసన రుచి శక్తిని పరిరక్షించుకున్నారట!
మీకో వాసుదేవ రహస్యం చెప్పనా?
అక్షయ పాత్ర కతుక్కున్న ఒక్క ఆవకాయ మెతుకే
కతకని దూర్వాస భుక్తాయాస కతమైందట!
రేషన్ లేకుండా దొరికే అమృతాన్ని
అహరహం (అచ్చోట రాత్రుళ్ళుండవు!) ఆబగా త్రాగి త్రాగి
విసువు చెంది మొహం మొత్తి వికారమెత్తి
ఆల్టర్నేట్ ఏమిటషా అని అమరులంతా ఆక్రోషిస్తూంటే
డొక్కా సీతమ్మ గారెంచక్కా ఆవకాయ ముద్దిడితే
ఆవురావురంటూ తిని బ్రేకుల్లేకుండా బ్రేవు బ్రేవుమని
ఇంతకాలం మిస్సైనామేవిటని బావురుమన్నారట!

నాకలోకంలో ఇప్పుడు ఆవకాయ బద్ద నాకకుండా
అమృతపానం చేస్తే నామర్దాట! అమ్మ తోడు!
అనుపమామృతానికి అనుపానం ఆవకాయే..యే అని
అశ్వినులూ ధన్వంతరీ అమాంతం ఒప్పేసుకున్నార్ట!
ఓషోష్! అందుకే గదట్రో మేమెప్పట్నుంచో
ఆవకాయతో బొబ్బట్లు భోం(దం)చేస్తోంది!
మరంచేత నా వినయ విన్నపం వీనుల కెక్కించుకోండోచ్!
తెల్గు తాతల్లారా! తెల్గు బామ్మల్లారా!
వచ్చేడప్డేం తీసికొచ్చాం? వేళ్ళేడప్డేం తీసికెళ్తాం!
అనే ఏట్టి ఏదాంతపు ఏళాకోళాలు ఎనక్కెట్టి
సంపాయించింది సొంతం సంతుకి వంతిచ్చేసినా
సొంతానికి కొంత ఆవకాయ మీ వంతుకు దాచుకోండీ!
ఆ లోకానికి ఎగిరేటప్పుడు ఎకాయకి!
వీడ్కోలు చెప్పకుండా ఆవకాయకి!
జాడీతో జోడీగా వెళ్ళటం విస్మరించకండీ..!

***

*(నవతెలుగు తేజం మాసపత్రిక జూన్ 2019 లో ప్రచురితము)*

23

# నిద్రా ముద్ర

క్షుత్తు రుచెరగదు! సుప్తి సుఖమెరుగదు!
ఆకలి దప్పులు లేకున్నా సురాపాన సుఖంతో
సోలాల్సిందే కాని నిర్నిద్రాభాగ్య సురల
కనురెప్పలు నిమి నివాసం కాలేవు కదా!
అందుకే అవతారాల వంకతో అవని పై పుట్టి
ఆవులించే అదృష్టంతో నిద్రాసుఖాన్ని
అనుభవించి అనుభూతి చెందుతారు!
నిర్దయాళువు కాగోరిన కుండ చెవులవాడు
నిద్రాళువు కాబట్టే మరో రావణుని బాధ తప్పింది!

అప్పుడు చచ్చి ఇప్పుడు "నేత" గా పుట్టాడే కాని
వెనుకటి గుణమేల మానురా! వెట్టి మనది కాని!!
ఓట్ల వాసనకు మాత్రమే మేలుకునే మార్పు తప్ప!
వాళ్ళ గురించి మనం ఎంత నిద్ర చెడగొట్టుకున్నా
ప్రయోజనం మాత్రం గుండు సున్నా!

వేసవి కాలం వస్తోందన్నా!
చందమామను కంటూ దొర్లుతావో!
ఏసీ రొద వింటూ పొర్లుతావో!
ఆవకాయ మీగడ పెరుగుతో
మరువకుమా! సుష్టుగా భోంచేయటం మాత్రం
అదే సుఖనిద్రా మంత్రం! తంత్రం!!

నిరుపహతి స్థలంబు.. అంటూ మను చరిత్ర కవి
నేర్పుగా "మెనూ" ఐతే చెప్పాడు కానీ
అవన్నీ అనుభవిస్తే ప్రబంధ కవిత్వం
ఊటగా ఉబికి వచ్చేస్తుందన్నది శుద్ధ అబద్ధం!
నిద్ర రావటం, సౌండు స్లీపటం మాత్రం నిబద్ధ సబద్ధం!
మీరూ ప్రయత్నించి చూడండి!
నిర్భయ, నిర్లజ్జా సుఖనిద్రా పరవశులై నిర్నిమిషులు కండి!

***

# నిర్వియోగి

ఏదో పోగోట్టుకున్నట్లుంటాడు ఎప్పుడు చూసినా
ఆ గుడ్లెప్పుడూ గ్లిజరిన్ వేయని కళ్ళలా
హురైజన్ చూస్తున్నట్లుంటాయ్
అలా అని మీసాలు గడ్డాలూ పెంచుకోలేదు ఏమీ !
కడుపారా తింటూనే ఉన్నాడు
నిండారా నిద్దరోతూనే ఉన్నాడు
పెళ్ళాం పిల్లలు ఉద్యోగాది సద్యోగాలన్నీ ఉన్నాయ్
కానీ ఎప్పుడూ .. మొహంలో అదే భావం.. అభావం!
వసంతుడికి వైరాగ్యం సోకినట్లు
శ్రీమంతుడికి శ్రీసోదరితో ఎంగేజ్ మెంటైనట్లు
కరవులో అధికమాసం వచ్చినట్లు ,,
పోనీ... సాఫ్ట్ నెస్ "వేర్ అండ్ టేర్" అయిపోయిన
మెళ్ళో బిళ్ళేసుకుని తిరిగే సాఫ్ట్‌వేర్ ఉద్యోగీ కాదు
విడాకులివ్వకుండా తడాకుల్తో తాట వలిచే
మిసెస్ ఉద్దాలక్ వంటి ఎడ్డెం తెడ్డెం ఇల్లాలూ లేదు
బట్ట ఉండక పోతుంటే ఉండబట్ట లేక అడిగేశాను
ఏం పోగొట్టుకున్నావు స్మీ అని!
ఈ నిస్తబ్ధత ఎందుకంటా.. అని!
నవ్వాడు! నవ్వాడా ? నవ్వినట్లున్నాడా ?
ఏదో శ్రుతమయ్యింది ! అన్నాడా? గొణిగాడా?
హంసగానమా ? పరమహంస ప్రవచనమా?
"ఔను ! పోగొట్టుకున్నాను!

షడ్వికారాల్ని! వ్యామోహాల్ని!
నువ్వాశించే శోధించే మమకార వికారాలు
నా ముఖ కవళికల్లో నీకు కన్పించవ్.."
ఐతే నువ్వు యోగివా? వియోగివా?
ప్రశ్నించే హక్కును ప్రయోగించాను
"నేను నిర్వియోగిని ..!"
అంటే ?
"అర్థమనర్థం భావయ సత్యం"
కళ్ళు తెరిచిన కాశీనాథుడా ?
మౌనం వీడిన దక్షిణామూర్తా??
అసలు ఒకళ్ళ విషయాలు నా కెందుకంట ..?
నా దారి నే పోక ! నాదారినే పోక!
పాలీ టెక్నిక్కుల పొలిటీషియన్సుతో నైనా పెట్టుకోవచ్చు
కానీ ఇలాంటి వాళ్ళతో "పొత్తు"కోకూడదు బాబూ!

***

.

25

## పాత సామాను

పాత సామాన్లు కొంటాం
పాత సామాన్లు కొంటాం
ఇప్పుడే..ఇక్కడే..
మా బండి దగ్గరే కొంటాం!..

నన్ను నేను గదిలోకి తోసేసుకుని
తలుపులు కలిపేసి బంధించేసాను!
నిశ్శబ్దంగా ...
తలుపుల తట్టుడు..త్రోచుడు..బాదుడు...!
తీయక తప్పక తీసాను
మరేం భయంలేదు!
పాతవైనా పనికిమాలినవి వాడేం తీసుకోడు..!
అర్ధాంగి గొంతులో నైరాశ్యం!
'antique లు వాడేం కొనడు!"
మొగుడూ పెళ్ళాల్లో
వయసులో వరహీనం కాకూడదనబట్టే కదా
ఈ అనర్థం!
సంప్రదాయం చట్టుబండలు!
వచ్చే జన్మలోనైనా యీ రూలతిక్రమించాలి!

మధ్యాహ్నపు "కల"త నిద్ర
అమాంతం చెదిరింది!

చెవులు స్వధర్మనిర్వహణ మొదలెట్టాయి!
సతి గొంతు సాగదీస్తోంది
"అంత పాతవేం కాదు..ఇంకో మాట చెప్పు!"
గది తలుపులు మూసి గడియేసి
మళ్ళీ ముసుగేసుకున్నా!
నా జాగ్రత్తలో నేనుండాలి కదా!
కలియుగ సతీసావిత్రులు
భార్య హోదా కంటే యమ పాకేజీయే
న"యమ"నుకోరని గారంటీ..
ఏంటి...ట!?

***

26

# పాథేయాలు

రాజకీయ సంతలకు
జనాల లారీల తరలింపులు
గ్రామ పట్టణ నగర జిల్లా రాష్ట్ర దేశ
ఎవర్ గ్రీన్ ఎన్నికల వ్యాపారాలు
అధికార కారిడార్లలో
సావకాశంగా సంచరించే
సహాయకుల సహకార బేరాలు
అప్రకటిత ఉపాధి హామీ పథకాలు!
ప్రభుత్వ బడ్జెట్‌కు బాధకం కాని
బహుళార్థ ప్రజా సాధకాలు!

***

# పూలు - రాళ్ళు

వామనేత్ర వరూధినుల నయనాలు
ప్రేమ మరంద స్రవ సుమాలు
వలచిన వానిపై యేచిన
అనంగ శర జాలాలు!
వలదు పో యని తొలగం ద్రోచు
ప్రవరాఖ్య హృదయాలు
ద్రవ్యలు కాని వజ్ర పాషాణాలు!
ఇంచుకైనా ద్రవించని మంచు రాళ్ళు!

కాళ్ళతో తొక్కించుకునే రాయి
ఉలి సమ్మెట పోట్లను కిమ్మనక తట్టుకుని
కాళ్ళను మ్రొక్కించుకునే దైవతమై
ఆలయాలలో కొలువై అర్చన లందుకుంటుంది!
ఎదురు దెబ్బలను సహనంతో కాచుకుని
కూలబడక నిలబడితేనే మాన్యుడ వౌతావని
రాయి చెప్తోంది జీవనావశ్యక రహస్యం!

పూవు చిన్నదైనా తావి ఘనమైతే
శివుని నెత్తినో సుదతి కొప్పునో
అధిరోహించే ఔన్నత్యాన్ని అందుతుంది
మనిషి కొంచెమైనా మనసు కుసుమం
మానవత్వంతో పరిమళిస్తే

జీవిత శిఖరాగ్రాలను చేరవచ్చని
పూలిస్తున్నాయి మనకు సందేశం!

పరిశీలన అనుశీలన ఉండాలే కాని
ప్రకృతి ప్రత్యణువూ పరమార్థం చెపుతుంది
ఒదిగి వింటే ఎదుగుతావు!
కాదు పొమ్మంటే ఏదుతావు!

***

28

# సహజ కవయిత్రులు

పెళ్ళాలు
పెద్ద కవయిత్రులు!
సంసార రామాయణానికి
“మొల్లలు”!
మాటమాటకీ , మాటిమాటికీ
వ్యంగ్యాలు, అన్యాపదేశాలు,
ధ్వనులు, శ్లేషలు!
కాళిదాసు నివ్వెరపోయే ఉపమలు!
అలిగితే ద్వైతులు
ఆమనిలో శిశిరాలు!
అవసరాలకు అద్వైతులు
గ్రీష్మంలో శరత్తులు!
మూడుంటే ప్రతిరోజూ పర్వమే!
మూడితే పర్వమైనా పస్తులే!
మొగుడికి మంత్రం "త్వమేవాహం"!
తనకు మాత్రం "అహమేవాహం!”
తములపాకు తగలాటానికి
తలుపు చెక్క సమాధానం!
పెళ్ళాలూ మీకు మంగిడీలు!
సంకటాలు మీతో సంగడాలు!

***

29

## ప్రియతమా వీడ్కోలు!

*(వాల్ట్ విట్మన్ "గుడ్ బై మై ఫాన్సీ" కి స్వేచ్ఛానువాదము)*

ప్రియతమా! వీడ్కోలు!
ప్రియ నేస్తమా నీకిక శెలవు !
ఇదే నా నిష్క్రమణం ! ఎరుగను నా గమ్యం !
నే నరయను నా అదృష్టం !
మరలా ఎప్పుడో నీ దర్శన భాగ్యం !
అందుకే ప్రియతమా! అందుకో వీడ్కోలు!
నా జీవితాన ఈ చివరి క్షణం
చేయనీ మన గతాన్ని మననం
నాలోని మెల్లని గడియారపు ధ్వని
సూచిస్తోంది మరణమాసన్నమైందని
చిరకాలపు మన పొందు
అందించె మధురభావాల విందు
అది మరపురాని అనుభూతి
ఇది భరింపరాని వియోగ గీతి
అయినా నిజానికి లేదెడబాటు మన యెడ
దీర్ఘకాలపు మన మనుగడ
ఆర్జించె ప్రేమ సమైక్యత
మరణమైనా లేదనైక్యత
ఎచటికైన పోనీ , ఎదురేమైన కా(రా)నీ
కలసే ఎదుర్కొందాము విధిని!
నా దివ్యగానానికి నీవు కర్తవు
నా మృత్యు ద్వారానికి నీవు మూర్తివి!
నా శాశ్వతాస్థిత్వానికి నీవు స్ఫూర్తివి !
అందుకే ప్రియతమా అందుకో!
చివరిసారిగా నీకు వీడ్కోలు
నను వీడని నీకు శుభాకాంక్షలు!

30

# ప్రేమాభిషేకం

ప్రేమకు లోకం దాసోహం!
అంటారు కవులహరహం!
వేదాంతులంటారు (వ్యా)మోహం!
అమ్మైనా, ఆలైనా
నాన్నైనా, నాథుడైనా
తోడబుట్టిన వాళ్ళైనా
తనకు పుట్టిన వాళ్ళైనా
చుట్టాలైనా, సుహృత్తులైనా
ఆత్మీయానుబంధ సుమ మాలలో
సృష్టి సూత్రం మాత్రం ప్రేమే!
ప్రతివారూ ప్రేమ సాగరంలో ఒక అలే!

ఋషుల వరకు సముద్రాలు ఏడే కాని
మనుషులకు ఎనిమిదోది ప్రేమ సముద్రం!
ఇందులో మున్క వేస్తే ఎప్పుడూ శుభమే!
ఇరవై నాలుగ్గంటలూ పుణ్యపర్వమే!
అది మానసిక స్నానం! సాంత్వన స్నానం!
సందర్భాలూ, మంత్ర సంకల్పాలూ అక్కర్లేనిది!
స్నానించాక తుడుచుకో నక్కరలేనిది!

ఆ ప్రేమార్ద్ర హృదయ సమాగతాత్ములై
అనవరతానందమయులు కండి!

ఆత్మీయస్వాంతులై జీవించండి!
ప్రేమాంత స్వాములై చరించండి!
ఇస్తే పుచ్చుకోండి!
త్రోసిరాజంటే నొచ్చుకోకండి!
ఉన్మాదులు కాకండి!
ఆమ్లాభిషేకాలు చేయకండి!
ప్రేమ ఐహికం కాదు! దైహికం కాదు!
దానం కాదు! వాయనం కాదు!
అది అక్షరం! అవ్యాజం! అనున్మేయం!
నవనవోన్మేష మమైక్యభావామృతం!

***

# మన తంత్రం

ఈ దేశం మనది! మనందరది!
ఈ గణతంత్ర దేశాన్ని
రణతంత్ర దేశంగా కాక
గుణతంత్ర దేశంగా
కర్మమంత్ర దేశంగా
వసుధైక కుటుంబ దేశంగా
వేదోద్ఘోషిత ఏకాత్మ సందేశంగా
రైతన్నల హలాలు పొలాల్లో
నాట్యమాడే ప్రదేశంగా
చేనేతన్నల చేతుల్లోమగ్గాలు
సరిగమలు పలికే దేశంగా
చేయాల్సిన బాధ్యత మనది! మనందరది!
త్రివర్ణ పతాకం రెపరెపలు
శాంతి కపోతం విహంగ విహారాలు
కాకూడదు ఓ ఆబ్దీక స్మృతి!
గుండె కైదండ కావాలి ఆ స్ఫూర్తి!
జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ!
ఏ దేశమేగినా ఎందు నిలబడినా
సేవించి తరిద్దాం తల్లి భారతిని!

***

# మల్లెలూ! మీకు జోహార్లు!

తెల్లకోక కట్టినా
తేటతెల్లని రైక తొడిగినా
రాకాశశాంక సితాభ్ర రశ్మియైనా
మల్లెల ముడువని ముదిత
గంధవిఫల గంధఫలియే!
అమేజాన్ అడవిదైనా.. ఆంధ్రా పెరటిదైనా
మల్లెలకు వశం కాని మత్తకాశిని మనేనా!
అంగజుడైనా అంగజహరుడే యైనా
మల్లె జెల్లలకు జివ్వుమనరా!
మరుమల్లెలకోసం మరుహరుడు
మల్లికార్జునుడై మురిపించలేదా!
"టెంపర్"తనాలూ, "తెంపరి"తనాలూ
మమైక్యమై రా కొట్టే వేళలో
ఉద్దీప్యం దేదీప్యమయ్యే దివ్యభవంలో
కబరీభర నిజసౌగంధ్య రసాస్వాదన రసికుడై
శివాని కేశాలు సహజ సౌరభ్యవశాలని
సాక్షాత్తూ మొగుడుంగారైన శివుడే సెలవిస్తే
అసంబద్ధమంటూ నత్కీరుడెవడోట
జంకులేకుండా ఛీత్కరించాట్ట!
అయ్యది మల్లెచెండుల మహిమే అయ్యుంటుందన్నాట్ట!
భావశాస్త్రినీ, వెన్నెల తిలకాన్ని ఆస్వాదించలేకపోయిన
నష్టాదృష్టి లానాటి అభాగ్యార్భక కవులు!

శృంగార ప్రబంధగ్రంథ గంధాలు మల్లెలే!
ఇల్లాలి కల్లోలోల్లోల్లస సల్లాపాలు మల్లెలే!
రవికాలపు ఎదలోని మల్లగుల్లాల
పరిష్కారం శశికాలపు మల్లెగుల్లలే!
గోటిపోటులకు మలిగిన మల్లెలే మేల్లేపనాలు!
మల్లె పవనానికి మసినుంచైనా నుసినుంచైనా
లేస్తాడు నరుడు మరుడై!
బాధలు పడి మందాకినిని భాగీరథిగా
సగరుల సద్గతికోసం "ట్రాన్స్ఫరం" చేసాడు గానీ
మల్లె పన్నీటిని సంప్రోక్షించితే పనైపోయేది కాదా!
ఏమిటో! చెప్పినవాళ్ళు లే పోబట్టి కాని!
యౌవనం ట్రాన్స్ఫర్ చేయమని ఆ మారాజెవరో కొడుకు నడిగాట్ట!
ఆ పిచ్చి(సు)కుమారుడు మల్లెలతో మంత్రిస్తే పనైపోయేది కదా!
మల్లె తంత్రాలు తెలియకుంటే మాయమొగుళ్ళ గతేమిటిట!
అందుకే ! మల్లెలూ .. మీకు జోహార్లు!
మల్లీ ! మల్లీ!.. మళ్ళీ మళ్ళీ!!

***

*(నవతెలుగు తేజం మాసపత్రిక అక్టోబర్ 2019 లో)*

# మాతృప్రేమ

కుపుత్రో జాయేత్క్వచిదపి కుమాతా నభవతి!
సన్యాసి శంకరునకైనా సన్నాసి నిగమశర్మ కైనా
అమృతస్వరూపం అనవధి అమ్మ ప్రేమ!
యశోదానందనుడైనా కౌసల్యా సుప్రజయైనా
అమ్మప్రేమసుధ కోసం ఆరాటపడ వలసిందే!
కడుపు కాలినా కాలు బెణికినా
అమ్మా అంటూ అంగలార్చాలిసిందే!
గడ్డి కూరిన బిడ్డ దేహాన్ని చూసి
పాలు చేపే పశువుదీ అమ్మ ప్రేమే!
కన్నబిడ్డకు కడపటి కాటి పూడికకు
తాళి ముడివిప్పిన చంద్రమతిదీ అమ్మప్రేమే!
కడుపులో తాచినా పులకరించేది అమ్మ ప్రేమే!
తండ్రి ఆజ్ఞతో తన తలను తెగ నరికినా
క్షమించి దీవించిన రేణుకదీ అమ్మ ప్రేమే!
ఇన్ని పాపాలు చేస్తున్నా ఇంకా మోస్తున్న
భూమాతదీ అమ్మ ప్రేమే!
చెరువుకుంటుంది గట్టు
నదికి ఉంటుంది తట్టు
కడలి కుంటుంది చెలియలి కట్ట
అమ్మ ప్రేమామృతవాహినికి లేదు ఆనకట్ట!

***

34

# మాధవసేవ

(చంకలో పసిపాపతో ఆడుకుంటున్న ఒక చిన్నపాప ఫోటో చూసి)

ఒకరి పూజలో ఒదిగె లక్ష్మై
ఒకరి ధ్యానంలో నిలిచె సరస్వతై
ఒకరి తపస్సుకు కేంద్రమయ్యె అంబయై
ఒకరి ఉపాసనకు ఆలంబనయ్యె బాలయై
ఒకరి కులదేవతయ్యె దుర్గై
ఒకరి గ్రామదేవతయ్యె శక్తై
ఇప్పుడిక్కడ ఇలా రహదారి దేవతై
(ప్ర)సాదానికై చేతులు చాస్తోంది!
దక్షిణకై అర్థిస్తోంది!
ఒళ్ళు మరచిన భక్తి చాలు!
కళ్ళు తెరచి కాసింత చూడు!
మానవత్వానికి మాన్యత చూపు!
నీవంతు నువ్వు చేసి చూపు!
మాధవుడు మెచ్చే సేవేదో
అంతర్ముఖుడవై ఆలోచించు!

***

35

## ర"సభా"యై నమః

స్పాన్సర్లెవరూ దొరకలేదు!
ఐతేనేం! సభ పెట్టారు!
తొమ్మండుగురు కవులు!
ఎన్మండుగురు శ్రోతలు!
కవిత్వం మరిగింది!
పొంగులు వారింది!
టూ యిన్వన్
తొమ్మిది 'మంద'యితేనేం!
సంభవితా కవిత్వేన
సంభవితా శ్రోత్రేన
అన్యోన్య సహాయ్యేన
సరస్వతీ కవిత్వ వాగభిషేకం
సంపన్నం! సుసంపన్నం!!!
సెల్ఫ్ కిక్కులు,
సెల్ఫీ క్లిక్కులతో
రసభస లేకుండా
సభ సజావుగా సాగింది!
కవితాగాన రసపానమెలా ఉన్నా
పోసిన తేనీరు మాత్రం తేనెలూరింది!
చెవులు తీపు! నాలిక తీపి!
అమ్మయ్య! అందరూ
నిశ్శబ్దంగా నిష్క్రమించారు!

వీళ్ళూ మంచోళ్ళే!
అరవటమే కాని కరవరు!
నోట మాటలే కాని
ఓటు కాటెయ్యరు!
శబ్దకాలుష్యం తగ్గినా
గది కాలుష్యాన్ని కడిగే
నాపని నేం చేసుకోవాలి కదా!
వాచ్ మన్ స్వగతం

***

# రాత్రి నా నేస్తం

ఈ చీకటి నాకెంతో నచ్చింది
అంధకారమైనా అందంగా ఉంది!
కానీ ఉషోదయ రేఖలు దీన్ని
ఛిన్నభిన్నం చేసేస్తాయి కదా!

ఈ కొక్కురు నాకెంతో ఇష్టం!
మనోరవం తప్ప మరేదీ విన్పించదు
కానీ ప్రభాత కూజనాలు దీన్ని
విచ్ఛేదిచ్ఛేస్తాయి కదా!

ఈ ఏకాంతం శాంతాక్రాంతం
స్వగతాల సొవల సాంత్వనం!
తెల్లవారితే ఔతుంది కదా
సాంద్రజనఘోష సంహృతం!

ఈ "కాలం" పగలు పారిపోయినా
రాత్రుళ్ళు దరిచేరుతుంది!
తెల్లందాక నాతోనే ఉంటుంది!
అందుకే పగలంతా జాగారం చేస్తాను
మళ్ళీ వచ్చే రాత్రికోసం!
నన్ను కమ్ముకునే మైత్రికోసం!

***

*(కౌముది వెబ్ మాసపత్రిక Dec 2017లో ప్రచురితము)*

## వానా వానా వందనం!

అంబరం అంబువుల్ని కురిపిస్తుంటే
శీర్షం తడిస్తే శైత్యం చేస్తుందని
clever గా చెట్టుక్రిందకు చేరాను
బయట వర్షం తగ్గింది
చెట్టు కురవడం మొదలైంది
ఆటో పిలిచి కూలబడితే
తడి సీటు పృష్ఠాన్ని తడిమింది
పృష్ఠం తడిస్తే పైత్యం ప్రకోపిస్తుందాని
intelligent గా మథన పడ్తూ
flat వచ్చిందని దిగానో లేదో
అంబరం మళ్ళీ సంబర పడితే
వళ్ళంతా జలసిక్తమైంది!
Watchman cum iron man pity గా
వళ్ళంతా తడిస్తే వాతం కమ్ముతుంది
త్వరగా పోయి dry అవండి సార్ అన్నాడు
వాడి genious బుర్రకు అసూయిస్తూ
ఇంట్లోకి పోయి ఒంటి తడార్చుకున్నాను
తెల్లారేసరికి ఉష్ణం కమ్మింది
"మీ తెలివి తెల్లారినట్లుంది!
అలా యీ వయసులో వానలో తడుస్తారా!!
మా ఇంటావిడ తెలివి ఎక్కువగా అంది!
వానా నీకు వంద వందనాలు!!
ఏ వయసులో తడవచ్చో చెప్పు చాలు!

***

# వికారి ఉగాది

ఐదేళ్ళకొచ్చే ఎన్నికల వసంతం
మళ్ళీ వచ్చేసింది!
పోలింగు ఉగాది విచ్చేస్తోంది!
అభ్యర్థి మన్మథులు
వాగ్దాన కుసుమాస్త్రాలతో
రంగుల కలల వసంతాలు చల్లుతూ
నీ పవిత్ర కరకమలదళమైన వేలు
ఈవిఎం లో వాళ్ళ గుర్తునే స్పృశించాలని
కాళ్ళా "వేళ్ళా" పడుతున్నారు!
నోట్ల వింజామరలు వీస్తున్నారు!
మత్తుపోతల పానకాల నైవేద్యం పెడుతున్నారు!
నీ పేరైనా తెలియని వాళ్ళు
పేరు లేని భగవంతుడవు నీవంటున్నారు!
ఓటరు మహాశయా! తస్మాత్ జాగ్రత!
ప్రలోభాలకు పొంగి లొంగావో
పై జీవితమంతా పచ్చడే!
చేదు తప్ప మరేమీ లేని ఉగాది పచ్చడే!
మిగిలేదంతా "వికార" మే!

***

# (వి)చికిత్స

సర్వకాల సత్యం ధర్మం!
దేశకాలానుగుణం న్యాయం!
కాలాతీతం ధర్మం, కాలవశం న్యాయం!
ధర్మ న్యాయాల దాంపత్యం కృతం
ధర్మ న్యాయాల స్నేహం త్రేతం
ధర్మ న్యాయాల కలహం ద్వాపరం
ధర్మన్యాయాల వైరం కలియుగం !
ధర్మం అలౌకికం ! న్యాయం ప్రాపంచికం!
ఆకలి పొట్టకు పట్టెడు అన్నం పెట్టటం ధర్మం!
తిన్నదానికి ప్రత్యుపకారం న్యాయం !
"గురుస్సాక్షాత్ పర బ్రహ్మ" సేవించటం ఒకనాటి ధర్మం!
గురుత్వానికి జీతంతో జీవం పోయటం ఈనాటికి న్యాయం!
"దర్మేచార్థేచ కామేచ త్వయేషాం నాతి చరితవ్యం"
బాసల పెట్టుబడికి కట్టుబాటే దాంపత్య ధర్మం !
సహజాసహజ స్వేచ్ఛా సహజీవనమే సమకాలీన న్యాయం!
వంశ సంస్కార సంప్రదాయ సంరక్షణం నాటి సంతాన ధర్మం!
తరతరాలు పంచుకునే సంపద్వారసత్వమే నేటి న్యాయం!
ఆదుకున్న సాయానికి ఆజీవన కృతజ్ఞత నాటి ధర్మం!
మాతృదేవత స్తన్యానికి మూల్యం కట్టటం నేటి న్యాయం!
"మను"వాడి "మమేక" మవటం నాటి ధర్మం!
"తను"వాడి తగువాడి "ఏకాకు"లవటం నేటి న్యాయం!
ధర్మ న్యాయాలు జీవన దర్పణ బింబ ప్రతిబింబాలు
ఎదురెదురుగా ఉన్నా పరస్పరాశ్రయాలు!
పరస్పరాశ్రయమే సమాజ ధర్మం ..హితం!

***

40

## వియోగులు

వాడు!
మండుటెండలో ఎండుతాడు
జడివానలో యీదుతాడు
చలిపులి నోట్లో తల దూరుస్తాడు
మాతా! కబళం!
మాధవ కబళం !
ఆడగందే పెట్టనిది అమ్మోతుందా?
ఆలోచనే రానివ్వకుండా
వీధుల్లో వెంపర్లాడతాడు!

ఆమె!
వచ్చినవాడు కుచేలుడో? కుబేరుడో?
సుఖభోగో! రోగో!
వద్దనకుండా మెదడును మొద్దుచేసి
ఒద్దకు చేరిన వాణ్ణి ముద్దు చేసి
ముద్దకోసం ముద్దరాలౌతుంది!

అది!
తోకూపుకుంటూ తలాడించుకుంటూ
పాచికూడో! ఎంగిలి మెతుకులో!
పారేసిందే పరమాన్నంగా
ఛీఛీ అనీసడించినా! ఛెఛే అనదిలించినా!

అంతో యింతో దక్కిందే బొక్కుతుంది!
వీధికి వాచ్‌మాన్ ఔతుంది!

వాళ్ళు!
ద్వంద్వాతీతులు!
వీతరాగభయక్రోధులు!
జీవేశ్వరార్చనలో
తలమున్కలైన యోగులు!
ప్రపంచానికి ప్రజ్ఞాతం కాని
స్థితప్రజ్ఞులు!

***

*(కౌముది వెబ్ మాసపత్రిక Feb 2019 లో ప్రచురితము)*

# వైర వాణిశ్రీ

మురిపాలిచ్చిన తల్లి
మరి పాలించాలని ఆలి
ఏం పాలు పోదు వాడి ఖర్మ కాలి!
అసమర్థస్య సాధూనాం!
తల్లీ పెళ్ళాం నడుమ నిష్క్రియతాం |
అధికారం కోసం (ఆడ) వాళ్ళది అనాది పోరాటం!
ఆత్మీయత కోసం వీడికి తీరని ఆరాటం!
ఎవరు ఎక్కువ? ఎవరు తక్కువ?
ఎవరంటే లేదుట మక్కువ?
అక్కడ పొత్తు అతకదు
ఇక్కడ పొందు కుదరదు!
నీ ఆలి మర్కటం
నీ అమ్మ కర్కటం

ఆ బొట్టెను మెచ్చి మెట్టించింది ఈ అమ్మే!
మెట్టి ఆ అమ్మను మొట్టి నొచ్చింది ఆ బొమ్మే!
వేళ్ళు కొమ్మల్ని తరుక్కుంటే
కొమ్మలు వేళ్ళను నరుక్కుంటే
చివరకు మిగిలేది మొండెం గుండె నెగళ్ళే |
ఆకాశం అంత అనాది
వాణి శ్రీల కలహాల పునాది!

నేటి అత్తా నాటి కోడలే
ఈనాటి కోడలు ఒకనాటికి అత్తే!
తెలిసినా ..ఎప్పటికప్పుడు కొత్తే!
“మమ”కారం లోని “మమ” అహంకారం!
“మమ”ను “మన” చేస్తే సహకారం !
సహకారమే సంసార సాకారం!
ఆచరణలో పండాలి సంస్కారం!
అప్పుడు అనగలడా .. అద్వైత శంకరం
“సంసారో యమతీవ విచిత్రః” !

***

# 42

## శిలా తోరణాలు

ఆకసాన విరిసే హరివిల్లు!
కురిసిన కుంభవృష్టికి
చేద కందని బావిలో
చేతికందే ఉబికిన నీళ్ళు!
పెరటి పచ్చగడ్డిపై పూచిన మందారాలపై
లే యెండలో మెరిసే హేమంత తుషార ముత్యాలు!
ముట్టుకుంటే ముడుచుకుపోయే ఆకులు!
అరచేతిలో మిణుగురు మెరుపులు!
ఉగాది వేపపూల ఎలవాసనలు!
మావికొమ్మలపై కోకిల కుహుకుహూలు!
జాబిల్లికి గుడికట్టే మేఘాకాశం!
తొలకరి చినుకుల నేల వింత గంధం!
వడగాలికి పిడచకట్టిన నోట్లో మట్టికుండ నీళ్ళు!
మండువేసగిలో తాటిముంజల మధురాలు!
ఆ ప్రకృతి చిత్రాలు బాల్య విచిత్రాలు
ఇప్పుడూ ఉన్నాయి!
మకిలి పట్టిన మనసు డోలు పొర
మొద్దుబారి స్పందనలకు కంపించటం మానేసి
అనుభూతులు ఆవిరై
అనుభవాలు ఎదమూలల
అతుక్కున్న అవశేషాలైనాయి!

***

*(నవతెలుగుతేజం మాసపత్రిక Dec 2018 లో ప్రచురితము)*

43

## శుభ దీపావళి

కోరికలు గుజ్జులైతే
ధరణిమీదే పరుగెడతాయి!
అవి అంబరాని కెగిస్తేనే అసలు చిక్కు!
ఆకాశానిది విశాల మానసం
ఎన్ని పేరాశల్నైనా ఎందరి దురాశల్నైనా
దాచుకోవటానికి చోటిస్తుంది!
అక్కడే ఎదో తారా బాంక్ లాకర్లో పెట్టేస్తే
కుదిర్తే పై జన్మలో నిజం చేసికోవచ్చు!
అంతదాకా ఆగలేక ఆపసోపాలు పడితే
పైకెగసినా గురుత్వాకర్షణకు లోనై
తిరిగివచ్చిన తారాజువ్వల మాదిరే
అవి వెలుగుల జ్ఞాపకాలే ఔతాయి!
గోచీకి పెద్ద! గావంచాకు చిన్న!
మధ్యతరగతి జీవితాల మానం!
కోరికల బైసైకిల్ యానం!
అసలు కాళ్ళు నేలమీదే ఉంటే
హాయిగా ఉంటుంది ప్రాణం!
దీపావళి దీపాలు చివరకు కొండెక్కినా
వాటి వెలుగులు మన గుండెక్కుతాయి!
సంవత్సరమంతా ప్రజ్వలిస్తూనే ఉంటాయి!
క్రొత్త ఉత్సాహానికి ఊపిరి పోస్తాయి!
లక్ష్య సాధనకు రహదారి దీపాలౌతాయి!

***

# శౌర్యాభినందనం

శత్రుబంధనం నుంచి సగౌరవంగా
మీసం మెలేస్తూ మాతృవందనం చేస్తూ
విజయవీరుడై వేంచేసిన
వర్ధమాన నందనునికి దేశమంతా
అభినందన సందేశాలిస్తుంటే
కొందరు పడ్డారు వ్యాకులం
గూగుల్నడిగారు వీడిదే కులం?
గర్భ శత్రువు పాక్ కూడా
అడిగినట్లు వినలేదు ఆ విషయం!
మనకున్న అతి తెలివితేటలు వారికేవి!
మాకు నీ యూనిఫాం మీద కులం బాడ్జి ఉండాలి!
అప్పుడే మేం సాల్యూట్ చేస్తాం
నీకో నీ తెగువకో కాదు! నీ కులానికి!
రాకేష్ రోదసిలోకి ఎగిసినప్పుడూ ఇదే రోగం పట్టింది మాకు!
ఈ మలిన మానసుల భూమిపై పుట్టిన పాపానికి
జగద్గురువు ఆదిశంకరులే జీవాత్మల ద్వైత భావ మాయాగ్రస్తుడైతే
కైలాసం నుంచి శంకరుడే దిగివచ్చి అయమాత్మా బ్రహ్మ అని
గుర్తు చేయాల్సి వచ్చింది !
మమ్మల్ని బాగుచేయటం బ్రహ్మకైనా పరబ్రహ్మకైనా సాధ్యంకాదనే
ఆది శంకరులు పాపం అర్థాంతరంగా తిరోగమించారేమో!
మేం లోకులం ! పలు కాకులం ! ఇలాగే ఉండిపోతాంలే కాని
అభినందన్ ! నువ్వేం దిగులుపడకోయ్!

మాతృ భూమి పరిష్వంగ బంధనం లోకి నువ్వు
తిరిగి వస్తున్నప్పుడు
నీ బుగ్గమీది ఆనంద బాష్పాలను ముద్దాడేముందు
గాలి నీ కులం ఏదని చెవిలో అడగలేదని సంతోషించు!
నువ్వు పేల్చిన శతఘ్ని నీకులం పట్టించుకోకుండా
నీ లక్ష్యం నెరవేర్చిందని ఆనందించు!
మా గాలి మాటలు పట్టించుకోకుండా
నీ వాయు పరిక్రమ పరికర్మ పరాక్రమాన్ని ప్రదర్శిస్తూనే ఉండు!
ఎలుగెత్తి నీ వియద్విహంగపు హోరులా అందరికీ నినదించి విన్పించు!
మేం సైని"కులం!" మేం రక్ష"కులం!"
మేం సర్జికల్ స్ట్రై"కులం!"
మీ కులంగోడలకు గోలలకు వ్యతిరే"కులం!"
జై భారత్! జై హింద్!

***

*(అభినందన్ విడుదల సందర్భంగా "కళాగౌతమి" కవి సమావేశంలో చదివినది)*

# శ్రోత్రియం

మా తాత శ్రోత్రియుట్ట!
శ్రుతులే ఊతంగా జీవించాట్ట!
మా నాన్నా శ్రోత్రియుడేట!
శ్రుతులే ఊపిరిగా బ్రతికాడట!
నేనూ...
ఇంట్లో పెళ్ళాం చెప్పినట్లు వింటున్నాను!
పిల్లలు చెప్పే పిట్టకథలు వింటున్నాను!
ఆఫీసులో బాసు చెప్పేది వింటున్నాను!
కొలిగ్స్ చెప్పు(డు) మాటలూ వింటున్నాను!
అహర్నిశలూ "చతుశ్శ్రుతాల్ని"
అనవరతం ఆకర్ణిస్తున్నాను గదా!
ఐనా మరి నన్ను శ్రోత్రియుడు కాదంటారేంటీ?
ఎందుకు స్మీ...?

***

# సంక్రాంతి సంభావన

సంక్రాంతంటే నాకిష్టం!
రంగవల్లులను అల్లే కాసేపైనా
ఇంతులను నేలచూసేట్లు చేసే
సంక్రాంతంటే నాకిష్టం!
గాలిపటా లెగరవేసే కాసేపైనా
తలపైకెత్తి కాలరెగరేసే క్షణాలు ప్రసాదించే
సంక్రాంతంటే నా కిష్టం!
మేళతాళాల మధ్య కొత్త పెళ్ళికొడుకులా
అనుభవించే భావిజీవితాన్ని
అభినయించి చూపే Do Do బసవన్నల
సంక్రాంతంటే నా కిష్టం!
నాని నాని నలిగి నలిగి వేగి వేగే
గారెలయ్యే మినప్పప్పు లాంటి
గృహిణుల త్యాగాలను గుర్తు చేసే
సంక్రాంతంటే నా కిష్టం!
భవిష్యత్తులో ఎంతో సాధించాలని
ఉత్సాహంతో ఉరకలు వేసే
బాలబాలికల కలలను స్ఫురించే
దాలిపొయ్యిమీద పొంగే పాయసపు
సంక్రాంతంటే నా కిష్టం!
కానీ
పాయసానికి పాలిచ్చిన గోవులూ

బియ్యాన్ని బెల్లాన్నిచ్చిన రైతులూ
కబేళాలకూ చెట్టుకొమ్మలకూ
చేరిపోతుంటే, చేజారిపోతుంటే,
ఈ ఇష్టం నాకు కష్టమైపోతోంది!
కాంతి, క్రాంతి తరిగిపోయిన ఈ సంక్రాంతిపై
ఇష్టాన్ని ఇముడ్చుకోలేక పోతున్నాను!
నిజమైన సంక్రాంతికై నిరీక్షిస్తున్నాను!

***

47

# సముద్రం

ఓ సముద్రమా
నీ కన్నా నా హృదయం విశాలం!
నీకన్నా నా హృదయం లోతైంది!
నీ బడబాగ్నులను మించిన కలతలు
దాన్లోనూ దాగున్నాయి!
నీ సునామీలను మించిన దుఃఖాలు
దాన్లోనూ విరుచుకు పడతాయి!
ఐనా అది నీ కన్నా గంభీరం!
నువ్వు మౌక్తిక ప్రవాళాకరం!
అది వజ్రాలకు వజ్రం!
నువ్వు అస్వాదు క్షారమయం!
అది ఆస్వాద ప్రేమక్షీరమయం!
గుప్పెడంతదే నా హృదయం!
అనంతమైనా నీవు దానికి అసమం!!!
అంటారు కాని నీకు నీవే సాటి
నువ్వేమాత్రం కాలేవు దాని పాటి!

***

48

## స్మృతులు

నేటికి నిన్న ఓ జ్ఞాపకం
ఈ క్షణానికి క్రిందటి క్షణం జ్ఞాపకం
అంతరాన జ్ఞాపకాల దొంతరలు
జీవన యానానికి ఇంధనాలు
కొన్ని జ్ఞాపకాలు సుధలు!
కొన్ని జ్ఞాపకాలు వ్యథలు!
జీవితం ఉగాది పచ్చడైతే
జ్ఞాపకాలు తద్భిన్నంగా ఉంటాయా!
మురిపించేవి కొన్ని
మైమరపించేవి కొన్ని
మరచిపోలేనివి కొన్ని
మరచిపోవాల్సినవి కొన్ని
అల్జీమర్స్ ఆవరిస్తే తప్ప
భరించాల్సినవే అన్నీ!
వృద్ధాప్య శిశిరానికి బాల్య వసంతం
ఓ అనుభూతి జ్ఞాపకం!
కోతి కొమ్మచ్చులాటల్లో విరిగిన కాలును
ఇప్పుడు చేత్తో నిమురుకుంటుంటే
ఇంటికి మోసుకుపోయిన స్నేహితం
కంటిలో చెమరించే కన్నీటి జ్ఞాపకం!
ప్రసవ వేదన నరాలను తోడేస్తున్నప్పుడు
క్రొంగొత్త గొంతొకటి చెంత వినిపించిన క్షణం

వర్ణనాతీతానుభవైకవేద్య జ్ఞాపకం!
మేధానిక్షిప్త జ్ఞాపకఖనులెన్నో!
కొన్ని రాళ్ళు! కొన్ని రతనాలు!
కొన్ని నావి! కొన్ని మీవి!
కొన్ని మనందరివీ!
జ్ఞాపకాలే అనుబంధాలకు ప్రాపకాలు!
అవే యీ బ్రతుకు తోలుబొమ్మలాటను
అగుపించకుండా ఆడించే సూత్రాలు!

***

# స్వాతంత్ర్యం - సామాన్యుడు

స్వాతంత్ర్యం సంపాదించుకున్నామని
చంకలు గుద్దుకుంటూ ..కుంటూనే డెబ్బైరెండేళ్ళైపోయాయి!
మంచి వ్యాయామమే!
కండలు వాచాయి కానీ దండలు రాలేదు!
సామాన్యుడు అసామాన్యుడు కాలేదు
మాన్యుడూ కాలేదు
అన్యుడుగానే మిగిలి పోయాడు!
స్వాతంత్ర్యం అంటే నోటికొచ్చినట్లు మాట్లాడ్డం
చేతికొచ్చినట్లు వ్రాయటం కాదు
నువ్వొక్కడివే ఎదగటమూ కాదు
నీ చేత ఓట్లు గుద్దించుకుని
నిన్నే గద్దిస్తాడు నీ ప్రతినిధి!
డబ్బుకూ ఇజాలకు మతాలకు కులాలకు
నీ ఓటును దేనికో ఓ దానికి అమ్ముకుంటూ స్వాతంత్ర్యం కోల్పోయావు!
సామాన్యుడి బానిసత్వం సలాం కొడుతూనే ఉంది!
ప్రతిభకు పట్టం కట్టనంతకాలం
స్వాతంత్ర్యం సామాన్యునికి మేడిపండే!
గుండు పేల్చటం రాకున్నా ఫర్వాలేదు
తుపాకిని పట్టుకోవటం వస్తే చాలంటూ
అంగరక్షకుడిగా చేసికొంటే
వాడి ఆత్మకు అంగరక్షకుడిగా నువ్వూ పోతావు!
గోడకట్టటం రాని వాణ్ణి మేస్త్రీ చేస్తే

పునాది లేని భవనమే కడ్తాడు!
సమాన అవకాశాలు కల్పించాలి!
ప్రతిభనే కొలమానం చెయ్యాలి!
స్వాతంత్ర్యానికి ముందు
భౌతిక వనరులే బయటికి పోయాయి!
ఇప్పుడు జెండాకి వందనం చేసేసి
ఎల్లలు దాటిపోతోంది అసలు వనరు మేధాశక్తి!
ఆ మౌలిక వనరుని యీదేశం తన ఎదలో పొదువుకున్నప్పుడే
దేశానికి సామాన్య పౌరుడికి
స్వావలంబన సిద్ధించినప్పుడే
స్వాతంత్ర్యం సార్థకం ఔతుంది!
కండల వాపు తగ్గాలంటే
ఫిజియోథెరపీ చేయండి
అంటే ప్రతి ఎన్నికలోనూ ఓటెయ్యండి
నెత్తినెక్కేవాడికి కాదు
చంక నెక్కించుకునే వానికి!!

***

*("కళా గౌతమి" సమావేశం లో చదివినది)*

50

## స్వాక్రమణం

వాణ్ణి చూస్తే చాలు
నాకు ఒళ్ళు మండుతుంది!
ఉత్త కబ్జారాయుడు!
దొరికితే చాలు
పిడికెడంతైనా, కడలంతైనా,
ఆక్రమణమే!
ఆక్రమణమే ఆక్రమణం!
ఎన్నాళ్ళనుంచో చూస్తున్నా గదా!
ఎక్కడైనా వాడికంటే ముందుగానే
పాగా వేద్దామనుకుంటే
అప్పటికే అక్కడో పాకో, బంగ్లానో కట్టేస్తాడు వాడు!
పాదరసంలా దూరిపోతాడు!
చిత్రం!
ఆక్రమితులూ వాణ్ణి వాటేసుకుంటారు!
వాణ్ణి త్రోసి రాజిల్లాలంటే
జీవితాంతం ఎదురు చూడాలేమో
అని తల్లడిల్లి డీలా పడిపోయాను!
హఠాత్తుగా ఓ రోజు తా మన్నాడని తెలిసి
ఉక్రోషాంతరంగంలో ఆనందం అన్పించినా
ఎక్కడో మూల విషాదమూ నక్కింది!
ఇంక వాడి ఆక్రమణలన్నింట్లో నేను దూరవచ్చు!

కడసారి చూపుకై నేనూ వెళ్ళాను!
దేశం అంతా అక్కడే ఉంది!
ఇంట్లో మనిషి పోయినట్లే
పొర్లి పొర్లి శోకిస్తున్నారు!
గుండెలమీద బాదుకుంటూ గగ్గోలు పెడ్తున్నారు!
నాకు ముందుకు వెళ్ళటానికే దారి దొరకలేదు!
నాలోనూ నక్కిఉన్న దుఃఖం పెల్లుబికింది!
నాకు పూర్తిగా తెలిసివచ్చింది!
వాడు కబ్జా చేసిన మనస్సులను
నేనెప్పటికీ ఆక్రమించలేను!
వాడు లేకున్నా అవి వాడికే రిజిష్టరై ఉన్నాయి!
వాడిది హృదయాల రియల్ ఎస్టేటు బిజినెస్!
నాలాంటివాడికి అది అందని ఆకాశం!
మళ్ళీ నాకు గుబులేసింది!
నా కంటే ముందే పైలోకంలోనూ
అమరావతిలో ఇదే బిజినెస్ మొదలెట్టాడేమో!
నే పోయేసరికి అక్కడా నాకేం మిగల్చడు!
అందరి గుండెలలోనూ స్థిరంగా తిష్ట వేసిన వీడు
నిజమైన యశఃకాయుడు! నిక్కమైన కీర్తి శేషుడు!!

***

## కిం కరోతి?

పృష్ఠతాడనాద్దంత భంగః
అంతదూరాన చైనావాడు తుమ్మితే
ఇంతదూరాన మనం ఇళ్ళల్లో దాక్కుంటున్నాం!
చైనా వస్తువుల్లో నాణ్యత ఉండదనటం
ఎంత అపప్రథో కొరోన కొట్టిపారేసింది!
మనుషులెట్లా ఏడ్చినా
వైరస్‌కు వసుధైక కుటుంబ భావన ఉంటుందని
ప్రపంచ పటంమీద గుద్ది చెప్పింది!
ఆత్మ స్తుతులూ అగ్రాహంకార హుంకృతులూ
అటకెక్కి అదృశ్యమైపోయాయి
రోడ్లమీద కపివీరులు తిరుగుతున్నారు!
తోకలు శరీరంలోకి ముడుచుకుని !
శతాబ్దాల తర్వాత దొరుకుతున్న స్వచ్ఛమైన గాలిని
రొమ్ములనిండుగా శ్వాసించేందుకు
గుండెలనిండా భయం!
మరీ క్రింద వాళ్ళకు ఓట్లున్నాయి
పార్టీలు ప్రభుత్వాలూ దండంతో పిండం పెడతాయి
మరీ పైవాళ్ళకు కోట్లున్నాయి
వాళ్ళ ప్లేట్లు ఎప్పుడూ నిండుగానే ఉంటాయి!
మధ్యవాళ్ళకే పాట్లున్నాయి
రెక్కాడక డొక్కాడని వాళ్ళే వెక్కుతున్నారు!
శానిటైజర్ లేకుండానే చేతులు పిసుక్కుంటున్నారు!

మనుషులెలాగోలా ఇళ్లల్లో కుక్కుకున్నారు
బ్రతుకులు మాత్రం బజారున పడ్డాయి!
సగటు మనిషికి దొరకని సుఖమూ సమస్యే!
దొరికే దుఃఖమూ సమస్యే!
బాలముకుందునికి నోట్లో వేలేసుకుంటే
ఆకలి తీరుతుందేమో కాని మనిషికెలా?
పనిలేని చేతి వేళ్ళకు పట్టెడు ముద్ద దొరికేదెలా?
బ్రతికుంటే బలుసాకు తిని బ్రతకొచ్చుట!
బ్రతికుండడం ఎలాగనేదే ముందు సమస్య!
ప్రభుత్వాలతో పాటు ప్రజలూ స్పందించాలి
చేతనైతే సొంతంగా చేద్దాం
లేదంటే చేసేవాడికి చేయూత నిద్దాం
కవిత్వంతో సంఘీభావం ప్రకటిద్దాం
ఆచరణలో చేతనైనంత మానవత్వం ప్రదర్శిద్దాం
ఈ వ్యథ ఎప్పటికి తీరేనో?
ఈ కొరోన కథ కంచికెప్పుడు చేరేనో?
సామాన్యుని యీ వెతలకు కామా పడేదెప్పుడో?
ఫుల్‌స్టాపులెలాగూ ఉండవనుకో!

***

*(సమాచారం దినపత్రిక 14.4.2020 లో)*

# రాత్రి రెండున్నరకు...

*(20.03.1977 రాత్రి పార్లమెంటు ఎన్నికల ఫలితాలు వెలువడినప్పుడు)*

ఎందుకీ రవళి
ఏమిటీ సందడి
నిబిడాంధ నిశీథినిలో
తమాల తరుశిర ప్రకంపన ఝరిలో
తారలన్నీ ఒక్కచోట చేరినట్లు
తుహినకిరణాస్వాదక చకోరాలు
వెన్నెల సంగీతాలాలపించినట్లు
మరుభూమిలో మల్లెలు పూచినట్లు
నిర్జల సైకతాలయాలలో మధువనులు
మలయపవనాలను వీచినట్లు
ఎందుకీ సందడి? ఏమిటీ రవళి?
చండప్రచండ భానుతాపవశమై
హిమవన్నగ శ్రేణి ఫటఫట మన్నట్లు
ఎక్కడిదీ మహానంద ధ్వని
కల్పవృక్షం కన్పించిందా!
కాదూ?
అంగారకునిలో అమృతం దొరికిందా!
కాదూ?
ఆ! ప్రపంచదేశాలన్ని నిర్యుద్ధ సంధి...
అదీ కాదూ?
మరెందుకీ సంరంభాలు?
అర్ధరాత్రి అంకమ్మ సివాలు!

గాఢ కుంభకర్ణ నిద్రా పరవశత నుండి
నాకీ బలవంతపు మేలుకొలుపులు!
ఏమిటీ! నిజం!! నిజంగానే!!!
ప్రజాస్వామ్యానికి పట్టం కట్టారా!
నవజీవనానికి నాంది పలికారా!
చైతన్యాగమనాన్ని చేతులతో స్వాగతించారా!
ఐతే ఇక నాకీ నిద్దుర వద్దు
నాకిక నిద్దురే వద్దు
కదలండి! ఇంక ఆగకండి!
నన్నూ మీతో కలుపుకోండి!
ఆనందం దోచుకోనీయండి!
సారీ! పంచుకోనీయండి!

***

*("సాందీపని" మాసపత్రిక మే 1977 లో)*

# శ్రుతి- అపశ్రుతి

## (దీర్ఘ కవిత)

కాలానికి వేయాలంటే సంకెళ్ళు
ఆపితే చాలదు గడియారపు ముళ్ళు
ఇది శ్రుతి
దేశంలో పోవాలంటే దురాగతాల కుళ్ళు
మూసుకుంటే చాలు మన కళ్ళు
గురువు దయతో చెప్పిందే విద్య
కాకుంటే మనకు జ్ఞానం అబ్బటం మిథ్య
శ్రుతి
మనం చెప్పమంటేనే చెప్పాలి గురువు
కాదంటే నిలబడటం కష్టం వాని పరువు
ఉపశ్రుతి
వేదమంత్రాలను వల్లించే బాపడు
ప్రపంచానికి పనికి రాని వెట్టి బాపతు
పనికిరాని శుష్క వాగ్దానాలు చేసేవాడు
దేశాన్నుద్ధరించే ప్రజానాయకుడు
కారణం లేనిదే కార్యం లేదు
ఇప్పుడే కారణానికీ కార్యం లేదు
చౌక డిపోలలో బియ్యం
వదలవు పురుగులతో వియ్యం
పెట్టుకోకు డీలరుతో కయ్యం
ఆలసిస్తే అవీ దొరకవు భద్రం
క్షీరనీరాలను వేరు చేస్తుంది హంస
అని కవి బ్రహ్మలు చేసారు ప్రశంస
ఓ హంసను పట్టి పాలముందు పెట్టు

అవి పాలను త్రాగితే నీ మీదొట్టు
బహుశ వాటికీ తెలుసు కల్తీ గుట్టు
అందుకే పోయాయి పడలేక యీ పాట్లు
తెల్లని వన్నీ కావు పాలు
మెరిసేదంతా కాదు మేలిమి
తెల్లని వన్నీ కావు బియ్యం
కొన్ని ఉంటాయి రాళ్ళు సత్యం
చెప్పాలంటే శ్రుతులెన్నో
ఉంటాయి వాటికీ ఉపశ్రుతులెన్నో
శ్రుతులన్నీ కావచ్చు సూక్తులు
కానీ ఉపశ్రుతులన్ని అపశ్రుతులు
అసలు పుట్టుకే ఒక అపశ్రుతి
బ్రతుకంతా మిథ్యా స్థితి
నిర్వాణ మొక్కటే సుఖస్థితి
అంటుంది వేదాంత వచన తతి
ఎక్కడ ఉంది లోపం
ఎవరి కృతమీ పాపం
ఖండఖండాతరాలను కనుగొన్నా
అంభోధి జలాలను మధించినా
ఖగోళ వీధుల్లో విహరించినా
మట్టిలోకి గిట్టటమే అంతిమస్థితి
ఎవరికైనా తప్పని దా గతి
ఇంతలో ఎందుకీ అవినీతి
ఇంతలా వదులుకొంటారు నిజాయతీ
అనంత కాల ప్రవాహంలో
నీ ఆయుః పరిమితి ఎంత?
పెంచుకోగలవా ఎంతో సుంత?

అది కాదు మన తరం
ఏనాడో అయ్యింది విధి పరం
మఱింకెందుకీ స్వార్థం
ఎందుకు సృష్టిస్తామీ అనర్థం
ఆకాశవీధుల నాక్రమించినా
ఆకలిదప్పుల నతిక్రమించలేదు
నింగి నేలలకు వారధి కట్టినా
మనసుల మధ్య అనుబంధాలు పుట్టలేదు
ఒకరి గొడవ మనకు పట్టక
మన గొడవ మనకు తట్టక
మనలో మనకు చెలికారమేర్పడక
సమతపై మమత పుట్టక
నీతి జీవనముపై తపన జనించక
ఎన్నటికి దొరుకుతుందీ నిరాశ కంతు
ఎప్పటికి పోతుంది నిస్పృహతో పొందు
అందుకే
ఆవేశాలు వదిలి అభిమానాలను నింపు
ఆవేదనలకు బదులు ఆనందాలను నింపు
అమరమైన ఆనందానికి మూలం మనస్సు
మనసులేని మనిషి చమురులేని జ్యోతి
వెలిగించు నిష్కల్మష భావాల వత్తి
సదా చరించు అయి ఆనంద వర్తి
ఇదే నేను చేసే వినతి
ఇదెన్నటికీ మారని శ్రుతి
దీనికెప్పటికీ లేదు అపశ్రుతి

***

*(కళాశాల వార్షిక సంచిక 1974 లో ప్రచురితము)*

# ఏషణ

ఈమని వారి శంకరాభరణం లా
ఇంగ్లాండు సభల్లో పాడాలని లేదు
వాల్మీకి రామాయణంలా
పరభాషా ప్రవేశం చేయాలని లేదు
శ్రీ హర్షుని నైషధం లా
విద్వదౌషధంగా పేరందాలనీ లేదు
కానీ ఎద ఎదలో
చైతన్యాన్ని రగిలించి
మనిషిని మనిషిగా నిలిపే
మనసున ఆర్ద్రత నింపే
కవితారస పానాన్ని
అందించాలని ఉంది
కవితగా గానం చేయాలని ఉంది.

***

*(సాందీపని మాసపత్రిక జనవరి 1975 లో)*

55

## అపేహ

నిన్ను తాకాలనుకొన్నాను
నింగివైపోయావు
నిన్ను ముద్దాడాలనుకొన్నాను
నిప్పువైపోయావు
నిన్ను కౌగిలించాలనుకొన్నాను
సెలయేరువైపోయావు
నిన్నెత్తుకోవాలనుకొన్నాను
భూగోళమైపోయావు
నిన్ను గట్టిగా బంధించాలనుకొన్నాను
గాలివైపోయావు
అలవిమాలిన ప్రేమలన్ని
ఇలాగే అఘోరిస్తాయి
పాంచభౌతికాల కెప్పుడూ
అడుగుల కందని
అనాలోచితపుటాశలే!
ఊర్ధ్వమూల మధశ్శాఖా
తరుచర చేష్టలే!

***

*(జులై 2021 "కౌముది" అంతర్జాల మాసపత్రికలో)*

# మనం

మరేమో, మా ఊళ్ళో
ఎంత బాగుంటుందో!!
అని
ఎవరి ఊరైనా ఎక్కడిదైనా
అలాగే అనిపిస్తుంది భావుకులకు!
ఇంకో ఊరు వెళ్తే మన ఊరు
ఇంకో రాష్ట్రం వెళ్తే మన రాష్ట్రం
ఇంకో దేశం వెళ్తే మన దేశం
చంద్రమండలమో కుజమండలమో
పోతే
మన భూమండలం!
అలాగే అనిపిస్తాయి! కనుపిస్తాయి!
అందుకే వసుధైక కుటుంబ భావన!
భువనైక కుటుంబ భావన
పెంచుకుంటే గొడవే లేదు!.
పంచుకోవటం అనేది అసలు ఉంటే
కొంచెం ఎక్కువ తక్కువలున్నా
కొసరు కొట్లాటల్లేకుండా సర్దుక పోవచ్చు.
"మన" నుంచి
మాకు
"మా" నుంచి
"నా"కు
పు(తి)రోగమించిన

"నా" గరికత

మళ్ళీ

"మన" గరికత

ఐతే

"మనం" మళ్ళీ మానవులమై

"మన"గలిగితే

ఎంత బాగుంటుందో కదా!

***

# బ్లాకో బ్లాకేన వైట్

మనఊరికి వస్తున్నాడు మంత్రి
అతడు జన మెరుగని పెద్ద కంత్రి !
అన్నది ఓ రామచిలుక, ఔనన్నది గోరువంక
వచ్చి ఏం చేస్తాడన్నది కాకి!
"గళంవిప్పి చెప్తాడు ఉపన్యాసం
అనర్గళంగా చేస్తాడు విన్యాసం"
విరిచింది పెదవి ఓ పిచ్చుక.
"అదంతా ఓ మాయకలాపం
ఏం తీరుస్తుంది దేశవిలాపం"
ఐనా చూసివద్దాము పదండి
ఏం చెప్తాడో వినివద్దామురండి
అన్నాయి పక్షులు, విప్పాయి రెక్కలు,
" – ఉద్యోగసమస్య లూడ్చేద్దాం
కరువుకాటకాలు కడిగేద్దాం
స్వార్థపరత్వం చంపేద్దాం
స్వర్గసుఖాలు స్థాపిద్దాం
నీతి నియమాలు నిలబెడదాం
బ్లాకుమార్కెట్టు నరికడదాం –"
అంటున్నాడు జగజ్జంత్రి, ఆగని స్రవంతి
వింటున్న పిల్ల కాకికి వచ్చింది సందేహం
బ్లాక్‌మార్కెట్ అంటే ఏమిటి అర్థం
పెద్దకాకి మందలించింది.
మంత్రిగారి మాటల నడుగ కూడదంది
చెబితే నీ కర్థంకానిది;
చూచితేనే కానీ తెలియనిదంది!
అయితే చూద్దాము పద

అని పిల్ల కాకి చేసింది రొద.
మార్గంలో ఆగింది పెద్దకాకి
"కనిపిస్తున్నానా నే"నని అడిగింది
పిల్లకాకి అచ్చెరువునొందింది.
కన్పిస్తున్నావని చెప్పింది
గడిచింది మరి కొంతదూరం
అయిపోయింది పెద్దకాకి అదృశ్యం !
పిల్ల కాకి విలపించింది పాపం!
"అమ్మా! నువ్వయిపోయావ్ మాయం!"
నవ్విన పెద్ద కాకి చెప్పింది
"ఒక పెద్ద బ్లాకుమార్కెట్టిది
ఆ బ్లాకులో నా బ్లాకు కలిసిపోయింది"
"అమ్మా! ఇదేనా మనం చూడాల్సింది?
అన్న పిల్లదాన్ని మరిదూరం తీసుకొచ్చింది
ఆశ్చర్య పడింది పిల్ల కాకి
"అమ్మా! తెల్లగా ఉన్నావు! వింతేమరి"
అయాసంతో నిట్టూర్చిన పెద్దకాకి అంది,
"అన్నిటికీ మూలమయిన మార్కెట్టిది!
ఆ బ్లాకుముందు నా బ్లాకు తెల్లనయింది"
పిల్ల కాకి పడింది విభ్రాంతి.
"ఇంత గొప్పమార్కెట్టు! ఎవరిదీగుట్టు?"
క్షణం ఆగి చెప్పింది పెద్దకాకి సవరించుకొంటూ కుక్షి
ఉపన్యాసకునిదే ఈ లోగుట్టు
ఎవరితోనైనా చెప్పేవు, ఒట్టు!

నీతి - ఉష్ణం ఉష్ణేన శీతలం
బ్లాకో బ్లాకేన వైట్

*(యువసాహితీ వేదిక "నవచేతన" కవితాసంకలనం 1975లో ప్రచురణ)*

## 1. నా కవిత

ఎదలో ఉబుకుతుందొక భావం!
హృదయ స్పందన దానికి జీవం!
అప్పుడే అవుతుందది కవితా గానం!
ప్రజాదరణే దానికి నిజమైన ప్రాణం !

*(ఆంధ్ర సచిత్ర వార పత్రిక 8-10-82 లో)*

## 2. పొందు

ఒక అనుభూతికి
అనుభవాలు రెండు
ఒకటి..ఇప్పుడు!
మరొకటి...
తొమ్మిది నెల్ల తర్వాత!

*(ఆంధ్రజ్యోతి వార పత్రికలో)*

## 3. అవకాశవాదం

అవకాశం లేక గానీ
ఇంకా అంతయినా
ఆక్రమించేది ఆకాశం!
పచ్చి అవకాశవాదానికి
ఇదేకదా ప్రథమ సాక్ష్యం!

*(ఆంధ్ర సచిత్ర వార పత్రిక 3-9-82 లో)*

## 4. గాప్

ఒకప్పుడు
నాన్నకూ నాకూ
జెనరేషన్ గాప్!
ఇప్పుడు
మా పెద్దాడికీ చిన్నాడికీ
జెనరేషన్ (లో) గాప్!

*(ఆంధ్ర సచిత్ర వార పత్రిక 23-4-82 లో)*

## 5. అంతరం

నీకూ.. నాకూ...
ఎప్పుడూ
రెండూ..రెండూ ..
నాలుగే!
నేను మితవాదిని
కూడతాను
నువ్వు అతివాదివి
హెచ్చవేస్తావు!

(ఆంధ్ర సచిత్ర వార వత్రిక 27-5-82 లో)

## 6. అసురసం

రాక్షసుల్లోనూ
మంచి వాళ్ళుంటార్ట!
పోదురూ బడాయి!
మీ మగాళ్ళలో లేరేంటి!
ఔను!
పెళ్ళాల్లోనూ అక్కడక్కడా!

## 7. పుర్రెకో బుద్ధి

నా చిన్నప్పుడు
పేపర్ రాకెట్లు విసిరేవాళ్ళు!
ఇప్పుడు
వాట్సాప్ రాకెట్లు (send)
నొక్కుతున్నారు!
పుట్టె లవే!
బుద్ధు లవే!

## 8. పూలకూచులు

ఎంచి ఎంచి
ఎంత జాగ్రత్తగా త్రుంచినా
ఎక్కడో కొన్ని పూబాలలు
మొక్కపై దాక్కునే ఉంటాయి!
అమ్మ చంక దిగక
మారాం చేసే పసి కూనల్లా!

## 9. కః సారమ్

కాసారం అలజడిస్తుంది
బెడ్డ పడ్డా!
చినుకు పడ్డా!
చినుకైతే కౌగిలిస్తుంది!
బెడ్డైతే భూమికి తోసేస్తుంది!
సంసార కాసారం
లోనూ అదే న్యాయం!

## 10. whyfe

సంసారం ఓ వైఫై!
w"i"fe + "I" !
అనంతం!
అనంతరాయం!
"I"తే
చిక్కల్లా ఆ "I" తోనే!

## 11. మగనాలి బతము

ఆంద్రకు
ఏడాదికొక్కనాడే
వరలక్ష్మీవ్రతం!
మగవాంద్రకు
ఏడాదిపొడవునా
గృహలక్ష్మీవ్రతమే!

## 12. చిరునామా

దీపానికి వెలుగే చిరునామా!
మనిషికి నడతే చిరునామా
కవికి కవిత్వమే చిరునామా!
దేశానికి సంస్కృతే చిరునామా!
ఆలుమగలు ఒకరికొకరు చిరునామా!
సంతానానికి సంస్కారమే చిరునామా!
అందరకూ అమ్మభాసే చిరునామా!
అమ్మభాసకు అమ్మే చిరునామా
అమ్మకు అమ్మే చిరునామా!

## 13. పదండి వోటుకు

ప్రజాస్వామ్య సతికి
బట్టలూడ్చేస్తున్నాయి
పార్టీలన్నీ!
వోటరు శ్రీకృష్ణులారా!
అక్షయంగా
వోట్ల వలువలు కప్పి
మాన సంరక్షణ చేయండి
పదండి! ఆలసించకండి!

## 14. మొగుడూ పెళ్ళామ్స్

కొందరు

భార్యాభర్తలు

మరికొందరు

ఆలుమగలు

ఎక్కువమంది మాత్రం

భార్యామొగుళ్ళే!

## 15. మయూఖాక్షుడు

అదృష్టం అంటే

ఆదిత్యునిదే!

కాలు కదపకుండా

ప్రపంచాన్నంతా పరికిస్తాడు!

గూగుల్ లేకుండానే!!!

## 16. "కావ్" యులు

ఎంత'మందో '

కావ్యకర్తలు!

చాలమంది

బుధులు!

కొంతమంది

బృహస్పతులు!

ఒకరిద్దరే

శుక్రులు!!!

## 17. లేటెస్టు బెస్టు

ముందొచ్చిన చెవులకన్నా
వెనకొచ్చిన కొమ్ములే మిన్న!
మెలిపెడితే చెవి
పొడవాల్సింది కొమ్ములేగా!

## 18. చుక్కలెక్క

వాక్యానికి ఓచుక్క పెడితే
ఆగటం!
మరో చుక్క పెడితే
కొనసాగటం!
జీవిత గమనంలో
అడ్డుపడే ప్రతిచుక్కని
ప్రక్క ప్రక్కన పేర్చుకుంటూ సాగిపో!
ప్రతి సమాప్తి కాదు పరిసమాప్తి!
చేసుకో బ్రతుకంతా ఆనంద పరివ్యాప్తి!

## 19. నేలటిక్కెట్టు

ఆకాశహర్మ్యాల పునాది
నేలపైనే!
నాయకుల ఓటుబాంకూ
నేలపైనే!
ఎప్పటికీ!!

# నానీలు

## 1. అపత్యం

పందిరి మంచాలు
పదికి తక్కువలేదు!
డబుల్ కాట్లు
అంతకే పరిమితం!

## 2. అదృశ్య శక్తి

గాలి వీస్తే
చెట్టు తలూపుతుంది!
మొగుడో వృక్షం!
మిగతాది ఊహ్యం!

## 3. అప్ అండ్ డౌన్

పైనున్నవాడు
లిఫ్ట్ ఆపరేటర్
ఎప్పుడూ పైకేనా!
క్రిందకూ దింపుతాడు!

## 4. ఆశ్రమాలు

అప్పుడాశ్రమాలు
వనాల్లో పర్ణశాలలు
ఇప్పుడూరిమధ్య
కాంక్రీటు స్లాబులు

## 5. వలవు డప్పులు

పాత వలపులు
కలుసుకున్నాయి
వయసులుడిగినా
గుండెచప్పుడదే!

## 6. భూ(బుర్ర) భ్రమణం

తిరిగే భూమ్మీద
పెరిగే మనిషి
బుర్ర తిరక్కుండా
ఎలా ఉంటాడబ్బా!

## 7. కళంకం

వేలిమీది గుర్తు
వెక్కిరిస్తోంది!
తనను అమ్మేసానని
మచ్చగా మర్చానని!

## 8. కాలగమనం

ఋతువులను బట్టి
రాగాలూ
అవసరాలను బట్టి
అనురాగాలూ!

## 9. టంగ్ కంట్రోల్

రుచించినవన్ని
అతిగా మింగకు!
రుచించనివేవీ
అతిగా వాగకు!

## 10. నల్లానల్లని..

బ్లాక్బాడీ, బ్లాక్ హోలూ
బాక్ గాడ్దూ,
మనకెప్పటికీ బ్లాక్ మైండే!
మైండ్ బ్లాంకే!

## 11. ఒకేబాట

పెళ్ళాం ఊరువెళ్తే
ఆ మజాయే వేఱు!
తనకీ అంతేట!
మాదీ ప్రేమపెళ్ళే!

## 12. ఋతు“గారా”లు

*(కళాగౌతమి మాసపత్రికలో Nov 2018 ప్రచురితము)*

సర్వవర్ణ సుమశోభితం
భావజ భావపులకితం
సాంత్వస్వాంతం
వసంతం!

తాపానికి రూపం
మేఘానికి శాపం
పుడమికి చిట్లిన దేహం
భీష్మం! గ్రీష్మం!!

మెరుపుల విద్యుత్తు
ఉరుముల బాజాలు
మన్నూమిన్నుల
వార్షిక కల్యాణం!

రక్తునికి కొమ్మ
భక్తునికి అమ్మ
శరత్పున్నమి చంద్రమా!
చెప్ప నా తరమ!

రాత్రిని చెలి ఎంగిలి!
ప్రొద్దున గుడి పొంగలి
హేమంతానికి
నా ప్రాంజలి!

ప్రకృతి సుషుప్తి
యోగనిద్రాణ శక్తి
శిశిరం! అది
నిశ్చల చేతనత్వం!

***

# హైకూలు

## 1. అసు(మ)రప్రేమ!

ప్రేయసి ఐతే
అభిషేకించు ప్రేమతో
చేయకామ్లంతో!

## 2. సంసార గోలం

భిన్నధ్రువాలు!
సంసారగోళానికి
ఆలూమగలు!
పిల్లాపాపలే
వాళ్ళ మధ్యన అక్షం!
మొత్తం త్రిప్పుడే!

## 3. పున్నామం!

అబ్బాయైతేట
ఆత్మావై పుత్రనామాసి |
అమ్మాయేంటిట ?

## 4. లాటరీ!

పువ్వుతో పుర్గా!
జేజె కాళ్ళపై పడొచ్చు!
అదృష్టం పడ్తే!

## 5. స్థానకలిమి!

మైదానం చలం
ఎక్కి అరుణాచలం
అయ్యా డచలం!

## 6. నేతి!

ఇది కాదిది
కాదిదీ కాదు! అది
అసలుండేనా?

## 7. లెక్కలేని జీవితం

జీవితం "పై"యా!
లేక ఇన్ఫినిటీ నా!
తేల్టల్లా లెక్క!

## 8. QR

పెళ్ళాం పిల్లలు
స్కాన్ కాని క్యూ ఆర్ కోడ్లు!
బ్రహ్మ పజిళ్ళు!

## 9. సొట్ట

సొట్టబుగ్గుంటే
కుర్రదానికో అందం!
మరి కారుకో?..

## 10. కూల్డ్రింక్

మండుటెండలు!
కూల్డ్రింకు సీసాక్కూడా
చెమటేస్తోంది!

## 11. మందారం

మందార చెట్టు
విరబూసిందొళ్ళంతా
కాశ్మీర కన్య!

## 12. అనంతం

తేనె తుట్టెలూ
ప్రియసుధాధరాలూ
పిండుకున్నంత!

***

# నానోలు

## 1. క్షోభం

చెరువులో
బెడ్డ
మనసులో
ప్రేమ.

## 2. సిగపెరుగు

గుండుపై
కేశాలు
వసంతపు
తొలిచివుళ్ళు

## 3. పు(తి)రోగమనం

నాడు
స్లీవ్ లెస్
నేడు
స్లీవ్ హోల్స్.

## 4. గగనహాలికం

వెలుగుపంటకై
ఆకాశంలో
నాట్లు
నక్షత్రాలు.

## 5. దృష్టి

పిందెలైతే
శివలింగాలు
పండిపోతే
మధుకలశాలు

## 6. భూమరిపోతు

తిరుగుతుంటేనే
భూమింతుందంటే!
తిరక్కపోతే
ఎంతుండేదో!

## 7. పొదుగు పని

రాజకీయులు
పికములు
వోటర్లు
కాకములు

## 8. తర్జని భర్జన

నేనూ
ఎన్నికల్లో
వేలు
పెట్టాను

## 9. నాస్తిత్వం

వంచిత
ప్రజలు
అద్దాల్లేని
ప్రతిబింబాలు

## 10. ముక్కోతి

బ్రహ్మచారీ
శతమర్కటః
భార్యాచారీ
నతమస్తకః

## 11. రక్షణ

హెల్మెట్టూ
పెళ్ళామూ
అసౌకర్యమైనా
అవసరం!

## 12. అకా"రణం"

రోగం
ఋణం
జీవితం
రణం!

## 13. ప్రేమ

కుదిర్తే
పెళ్ళి
ముదిర్తే
పిచ్చి

## 14. స్నేహం

నమ్మితే
సోహం
వమ్మైతే
ద్రోహం

## 15. స్టాప్క్లాక్

బాటరీ
ఐపోతే
ఆగిపోయే
కాలమానం!

## 16. ఐస్

ఫ్రిజ్
బిడ్డ
ఐసు
గడ్డ

## 17. పేగు

కడుపు
తీపి
వాడైనా
పాపి!

## 18. వాన

నిలువుగా
వర్షం
అడ్డంగా
నది!

## 19. వాసంతం

రెట్టిస్తే
పికం
పలికిస్తే
శుకం

## 20. వేదాంతం

కాడి
జీవితం
పాడెతో
ఖతం

## 21. అసలు ముఖం

కవులు

కల్పించే

చంద్రముఖం

ఆవైపుదట!

- :: సమాప్తం :: -



# ఇంగితాలు



అర్థరాత్రి దాటాక సొతంతరం వచ్చినట్టు,
పెళ్ళిచూపుల్లోనే పిల్ల నచ్చినట్టు,
డిటర్జెంటుతోతెల్లగా ఉతికినట్టు,
అర్జంటుగా అచ్చొత్తించి అంబారీ
ఎక్కించవలసిన అబ్బురపు కవితాసంకలనం.

- శతావధాని డా. పాలపర్తి శ్యామలానంద ప్రసాద్
విజయవాడ



కవితలన్నీ లక్షణంగా ఉన్నాయి.
ఎలా ఉండాలో అలా ఉన్నాయి.
కవి యొక్క పద్యకవిత్వ రచనా వాసన
మధ్యమధ్యలో గుబాళిస్తోంది.
సంస్కృత శబ్దాలతో కవితాశీర్షికలను పెట్టటం
విశేషంగాను, విభిన్నంగానూ ఉన్నది.
చివరిదాకా చదువ వలసిన పుస్తకం. అభినందనలు.

- శ్రీ జోరా శర్మ
ప్రముఖ (హ్రస్వ) వచన కవి
రాజమహేంద్రవరము



# కవి పరిచయం

| | |
|---|---|
| **రచయిత:** | కవితా (వేంకట సూర్య నారాయణ) ప్రసాద్ |
| **జననం:** | 1955 |
| **ఊరు:** | అవనిగడ్డ, కృష్ణాజిల్లా (ఆం.ప్ర) |
| **తల్లిదండ్రులు:** | వాస్తు జ్యోతిష విద్వాన్, దైవజ్ఞరత్న బ్రహ్మశ్రీ కవితా కామేశ్వర శర్మ, రాజ్యలక్ష్మి. |
| **చదువు:** | MSc (chemistry), PG Dip. (Appd. Statistics),(PhD) స్కంధ త్రయ జ్యోతిషము (వారసత్వము). |
| **వృత్తి:** | D.G.M (retd.), ONGC. |
| **అభినివేశము:** | పద్య, వచన కవిత్వములు, కథారచన, వాస్తు జ్యోతిష ముహూర్త శాస్త్రములు. |
| **రచనలు:** | వివిధ పత్రికలలో పద్య గద్య కవితలు, కథలు, వ్యాసాలు, ఆకాశవాణి పద్య సమస్యాపూరణలు, వివిధ కవితా సంకలనములలో రచనలు. |
| **గ్రంథములు:** | శ్రీ రాజశేఖర శతకము,<br>శ్రీ వేంకటేశ్వర ద్విశతి,<br>కొరోన వారణార్థనా పద్యపంచాశిక<br>కావవే! కామేశ్వరీ!! (శతకము),<br>ప్రవచన కవితా (౨) కవితలు (వచన కవితా సంపుటి),<br>మాటవెలదులు (పరశ్శతకము),<br>ప్రపద్యాపీడము (ఖండ పద్యకవితా సంపుటి),<br>ఇష్టకథాష్టకము (కథాసంపుటి),<br>ముహూర్త కామేశ్వరము. మొ. |